1. తెలంగాణ భాషా సంస్కృతులు - వివక్ష 5
2. తెలంగాణ కవిత్వం - జీవనరేఖలు 15
3. తెలంగాణ భాష - కవిత్వం 23
4. ముంపుకు గురయితున్నది తెలంగాణ భాష 31
5. తెలంగాణ వ్యావహారిక భాష - తీరుతెన్నులు 36
6. తెలుగు సాహిత్యంలో తెలంగాణ వాదం 44
7. గతదశాబ్దిలో తెలంగాణ ప్రాంతీయ సాహిత్యం 51
8. సాంస్కృతిక ఆధిపత్యానికి సాక్ష్యాలు కావాలా? 63
9. తెలుగుతల్లి - తెలంగాణ తల్లి 68
10. మానవ సంబంధాలమహోత్తేజం - బతుకమ్మ పండుగ 71

# తెలంగాణ భాషా సంస్కృతులు - వివక్ష

**సు**మారు 42 సంవత్సరాల సమైక్య జీవనం తర్వాత తెలంగాణ భాష, సంస్కృతులు అస్తిత్వంకోసం, ఉనికికోసం పోరాడుతున్నయి. ప్రాంతాలు వేరైనా భాష ఒక్కటనే సాకు మీద ఆంధ్రా తెలంగాణా ప్రాంతాల్ని కలిపి ఒక రాష్ట్రంగా ఏర్పాటు చేసినప్పటికీ పొరపొచ్చాలు పోలేదు. పైగా బాగా పెరిగిపోయినయి. ఆనాడు భిన్న చారిత్రకనేపథ్యాలు, నాగరిక స్థితులు కలిగిన రెండు ప్రాంతాలను కలిపెటందుకు ఒక భాషగా చెప్పబడిన ఏ తెలుగు భాషయితే ప్రధాన సూత్రమైందో ఆ భాషే ఇయ్యాల్ల వేర్పాటుకు ముఖ్య సమస్యగా ముందుకొస్తున్నది.

రెండు ప్రాంతాల వ్యవస్థలు రెండు విభిన్న చారిత్రక నేపథ్యాల నుంచి రూపొందినయి. రెండు ప్రాంతాల ప్రజలు భిన్న రాజకీయార్థిక జీవనం వల్ల భిన్న సాంస్కృతిక దశల్ని కలిగి ఉన్నరనేది గుర్తుంచుకోవాలె. వాళ్ళ అనుభవాలు గూడ వేర్వేరుగా ఉన్నాయని గుర్తుంచుకోవాలె. ఇసోంటి దశల్లో 'కలపబడిన' ప్రజా సమూహాలు ఎంతకాలం 'కలిపి ఉంచినప్పటికీ' అది ప్రజాస్వామిక కలయిక కాలేదని, వారిమధ్య సమాన అభివృద్ధి సాధ్యం కాదని చెప్పేతందుకు నాలుగు దశాబ్దాల ఐక్యత సృష్టించిన వివక్షలే, విభేదాలే నిదర్శనం.

ఒకజాతి ప్రజల జీవన స్థితిని అర్థం చేసుకోవటానికి భాష ముఖ్య ఆధారంగా ఉంటది. ప్రజలు ఏ స్థితిలో ఉన్నరనేది వాళ్ళ భాష ఏ స్థితిలో ఉన్నదో పరిశీలించటం ద్వారా తెలిసిపోతది. అందుకే చైతన్యాన్ని అణిచే పాలకులెప్పుడూ ప్రజల భాషను అణిచి ఉంచేటందుకే ప్రయత్నిస్తరు. ఉత్పత్తిలో భాగంగా ప్రజలు భాషలు సృష్టిస్తరు. ఆ భాషలను పాలకులు తమకనుగుణంగా అటు ఇటూ సంస్కరించి తమ భాషగా తయారుచేసి చెలామణి చేసి ఆధిపత్యాన్ని చెలాయిస్తరు. సంపదలు దోచుకొనేటందుకు, ప్రజలమీద పెత్తనం చేసెటందుకు భాష చాలా ఉపకరిస్తది. కెన్యా రచయిత గుగీ చెప్పినట్లు భాష అన్నిటికన్న మహత్తరమైన సాధనం. దీనిద్వారా ఆత్మను వశం చేసుకోవచ్చు. అణిచివేతద్వారాగాని,

# తెలంగాణ భాషా సంస్కృతులు - వివక్ష

**సు**మారు 42 సంవత్సరాల సమైక్య జీవనం తర్వాత తెలంగాణ భాష , సంస్కృతులు అస్తిత్వంకోసం, ఉనికికోసం పోరాడుతున్నయి. ప్రాంతాలు వేరైనా భాష ఒక్కటనే సాకు మీద ఆంధ్రా తెలంగాణా ప్రాంతాల్ని కలిపి ఒక రాష్ట్రంగా ఏర్పాటు చేసినప్పటికీ పొరపొచ్చాలు పోలేదు. పైగా బాగా పెరిగిపోయినయి. ఆనాడు భిన్న చారిత్రకనేపథ్యాలు, నాగరిక స్థితులు కలిగిన రెండు ప్రాంతాలను కలిపెటందుకు ఒక భాషగా చెప్పబడిన ఏ తెలుగు భాషయితే ప్రధాన సూత్రమైందో ఆ భాషే ఇయ్యాల్ల వేర్పాటుకు ముఖ్య సమస్యగా ముందుకొస్తున్నది.

రెండు ప్రాంతాల వ్యవస్థలు రెండు విభిన్న చారిత్రక నేపథ్యాల నుంచి రూపొందినయి. రెండు ప్రాంతాల ప్రజలు భిన్న రాజకీయార్థిక జీవనం వల్ల భిన్న సాంస్కృతిక దశల్ని కలిగి ఉన్నరనేది గుర్తుంచుకోవాలె. వాళ్ళ అనుభవాలు గూడ వేర్వేరుగా ఉన్నాయని గుర్తుంచుకోవాలె. ఇసోంటి దశల్లో 'కలపబడిన' ప్రజా సమూహాలు ఎంతకాలం 'కలిపి ఉంచినప్పటికీ' అది ప్రజాస్వామిక కలయిక కాలేదని, వారిమధ్య సమాన అభివృద్ధి సాధ్యం కాదని చెప్పేతందుకు నాలుగు దశాబ్దాల ఐక్యత సృష్టించిన వివక్షలే, విభేదాలే నిదర్శనం.

ఒకజాతి ప్రజల జీవన స్థితిని అర్థం చేసుకోవటానికి భాష ముఖ్య ఆధారంగా ఉంటది. ప్రజలు ఏ స్థితిలో ఉన్నరనేది వాళ్ళ భాష ఏ స్థితిలో ఉన్నదో పరిశీలించటం ద్వారా తెలిసిపోతది. అందుకే చైతన్యాన్ని అణిచే పాలకులెప్పుడూ ప్రజల భాషను అణిచి ఉంచేటందుకే ప్రయత్నిస్తరు. ఉత్పత్తిలో భాగంగా ప్రజలు భాషలు సృష్టిస్తరు. ఆ భాషలను పాలకులు తమకనుగుణంగా అటు ఇటూ సంస్కరించి తమ భాషగా తయారుచేసి చెలామణి చేసి ఆధిపత్యాన్ని చెలాయిస్తరు. సంపదలు దోచుకొనేటందుకు, ప్రజలమీద పెత్తనం చేసెటందుకు భాష చాలా ఉపకరిస్తది. కెన్యా రచయిత గుగీ చెప్పినట్లు భాష అన్నిటికన్న మహత్తరమైన సాధనం. దీనిద్వారా ఆత్మను వశం చేసుకోవచ్చు. అణిచివేతద్వారాగాని,

అంగీకారం తయారు చేసుకోవటం ద్వారా గాని, ఒకసారి ప్రజల మెదళ్లమీద ఆధిపత్యం సాధించారంటే ఇగ సంపదలన్ని కొల్లగొట్టుకపోవచ్చు. అట్లా ప్రజలమీద ఆధిపత్యం సాధించెతందుకు తేలికయినదీ మొదటిదీ భాషాధిపత్యం. పాలకులు, సంపన్నులు ఏ ప్రజా సమూహం మీద పెత్తనం చెయ్యదల్చుకున్నారో ఆ ప్రజా సమూహం భాషను చిన్నచూపు చూస్తరు. తక్కువ భాషగా ప్రచారం చేస్తరు. తమ ఆధిపత్యం కోసం, అధికారం కోసం తక్కువ భాషలు, ఎక్కువ భాషలు అనే వ్యత్యాసాలు లేవదీస్తరు.

భాషల చరిత్రలో బానిస సమాజం నుంచి ఆధిపత్యభాషల, బానిస భాషల దృష్టి కొనసాగుతున్నది. శతాబ్దాలకింద పాలకవర్గాలు పోషించిన సంస్కృత భాషాధిపత్యం కింద తెలుగుభాష అట్లా అవస్థ పడింది. రాజ్యవిస్తరణ, సామ్రాజ్యాల స్థాపనలో భాగంగా భారతదేశంలో సంస్కృతం విస్తరించి ప్రాంతాల భాషల్ని అణిచివేసింది. ప్రాంతభాషల్లో బలం లేదని సృష్టించిన అపవాదుల్లో తెలుగుభాష కూడా నలిగి పోయింది. తెలుగు పదాలలో సత్త్వం లేదని, సరిపోను శబ్దజాలం లేదని అవమానించిండ్రు. బ్రిటిష్‌పాలకుల కాలంలో ఆంగ్లాధిపత్యం కింద తెలుగు న్యూనతకు లోనయింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రభాష తమిళభాషారాధన ముందు అవమానం పొందింది. అంత అవమానం అనుభవించిన ఆంధ్రభాష ఇప్పుడు తన ఆధిపత్యంతో తెలంగాణ భాషనట్లాగే అవమానిస్తున్నది. అభ్యుదయ రచయితలు మొదటిసారిగా రచనల్లో ప్రజలభాషను ఉపయోగించినపుడు ఇసోంటి అపవాదే వచ్చింది. అభ్యుదయ రచయితలు మోటుభాష వాడతారని, సున్నితమైన, మధురమైన భాషకు వ్యతిరేకులని పాలక వర్గీయులు ఆక్షేపించిండ్రు. సరిగ్గా ఇపుడు తెలంగాణా భాష ఈ అవమానాల్ని పొందుతున్నది. తెలంగాణ భాషలో జిగి లేదని, శబ్దజాలంలేదని, మోటుగ ఉంటదని, సున్నితత్వం ఉండదని, మర్యాదకరంగా నాజూగ్గా ఉండదని ఈసడింపులను, అవహేళనలను ఎదుర్కొంటున్నది. సినిమాలల్ల, టి.వీ సీరియల్స్‌ల రౌడీలకు, విలన్లకు, హాస్యపాత్రలకు తెలంగాణా రాయలసీమ భాషపెట్టి దారుణంగా అవహేళన చేస్తున్నరు. వెనుకబడిన ప్రజల భాషలు ఎదుర్కొనే అనేక సమస్యలకు అభివృద్ధి చెందిన భాషల ఆధిపత్య భావనే మూలమైనది.

తెలంగాణ భాషలో ఉర్దూపదాలు ఎక్కువగా ఉంటాయని మరో ఆరోపణ. భాషా వికాసాన్ని శాస్త్రీయ దృష్టితోని పరిశీలించినపుడు ఏ భాష మడిగట్టుకొని శుద్ధంగా ఉండదని అర్థం చేసుకోవటం కష్టమేమికాదు. ఒక భాష ఎదుగుతున్న క్రమంలో ఎన్నో ఇతర భాషా సమూహాల పదాలు కలుపుకుంటూ సాగిపోతది. తెలుగులో ఎప్పుడూ పాలనా భాషాపదాలు



50 శాతం పైగా ఉంటూవచ్చాయని పరిశోధకులు చెబుతున్నారు. సంస్కృత, ప్రాకృతాల కాలంలో, అరబ్బీ, పారసీల ప్రాబల్యంలో, ఇంగ్లీషు, పోర్చుగీసు కాలంలో ఎన్నో అన్యదేశ్యాలు అన్ని ప్రాంతీయ భాషల్లో చోటు చేసుకున్నయి. తెలుగులో కూడా. అట్లానే తెలంగాణ ప్రాంతంలో ఉర్దూ పాలనాభాషగా ఉండటంవల్ల ఆ భాషాపదాలు తెలంగాణభాషలో చాలాభాగం వచ్చి చేరినాయి. ఇయ్యాల్ల ఆంధ్ర తెలుగులో ఉన్న అన్యదేశాల గురించి కూడా పరిశీలించాలెమరి. తెలంగాణ వాళ్ల తెలుగు మాట్లాడితే ఆంధ్ర ప్రాంతం వాళ్ళకు నవ్వొస్తది. తక్కువకు ఇక్కడి తెలుగును అనుకరించి మరీ నవ్విస్తరు. ఇద్దరిదీ తెలుగే అంటరు. తెలంగాణా తెలుగులో ఉన్న ఉర్దూపదాలు హేళన గుర్తులుగా, ఆంధ్ర తెలుగులో ఉన్న ఇంగ్లీషు పదాలు గొప్పతనానికి గుర్తులుగా భావించటం వెనుక ఏ దృష్టి ఉన్నది? తెలంగాణా భాషకు 'తౌరక్యాంధ్ర' అని పేరు పెట్టిన పండితులు కూడా కోస్తాంధ్ర భాషకు 'ఇంగ్లీషాంధ్ర' అని పేరు పెట్టలేకపోయిండ్రు.

తెలుగులో గ్రాంధిక భాషమీద వ్యవహారభాష సాధించిన విజయం చాలా ప్రగతిశీలమైనదే. అయితే తెలంగాణ భాషను అణిచివేయటంలో ఆంధ్రప్రాంత వ్యవహార భాష పాత్రకూడా గుర్తించాలె. వ్యవహారిక భాషావాదులు ప్రగతిశీలురైన ఆంధ్ర భాషా పండితులు తెలంగాణ వ్యవహారభాష విషయంలో ఎందుకు అడ్డంకులు పెడుతున్నారో జాగ్రత్తగా ఆలోచించాలె. గత ముప్పయేండ్లుగా తెలంగాణ, ఆంధ్రప్రాంతాల భాషాసమస్య వచ్చినప్పుడల్లా తెలివైన వాళ్ళు, భాషావేత్తలు, 'ప్రామాణికభాష'ను ముందుకు తీసుకొస్తండ్రు. 'ప్రామాణికభాష' వాదంలో అంతర్గతంగా న్యూనప్రమాణ భాష, న్యూనభాష దృష్టికూడా ఇమిడి ఉన్నది. ఏది ప్రామాణిక భాష? ప్రమాణాలు ఎవరు నిర్ణయిస్తరు? ఎట్లా నిర్ణయిస్తరు? చర్చ కొంతవరకు సాగింది. అప్పుడు పండితులు ముఖ్యంగా ఆంధ్రాపండితులు పత్రికాభాష రచనాభాషనే ప్రామాణిక భాషగా భావించాలనే తీర్మానించిండ్రు. ఇది అందరికీ సమ్మతంగా అనిపించినప్పటికీ, ఆమోదించినప్పటికీ ఈ వాదం వెనుక ఉన్న 'కుట్ర' చాలాకాలం వరకు గానీ బోధపడలేదు. పత్రికా భాషంటే ఇప్పుడున్న తెలుగుపత్రికల్లో ఉపయోగించేభాష. ఈ పత్రికలు ఎవరివి? ఏ భాషను అవి ఉపయోగిస్తున్నయి? ఉన్న అన్ని పత్రికలకు పెట్టుబడులు పెట్టిన యజమానులు ఆంధ్రాప్రాంతం వారు. ప్రసారసాధనాలు, ప్రచురణ సంస్థలు ఆంధ్రప్రాంతీయులవి. అందులో ముఖ్యస్థానాల్లో ఉండి భాషా నిర్మాణాలు, రచనా పద్ధతులు నిర్ణయించేవాళ్ళు ఆంధ్ర ప్రాంతీయులు. వాళ్ళు నిర్ధారించి ప్రచారం చేసిన రూపాల్ని ప్రమాణంగా భావించటంవల్ల కోస్తాంధ్ర బూర్జువా వర్గాల భాష, సంపన్న పాలక వర్గాల

భాష "ప్రమాణ భాష" అయి కూచున్నది. వ్యవహారభాషావాదంలో ప్రజల వాడుక భాషను ముందుకు తెచ్చి గ్రాంధికభాష మీద విజయం సాధించినవారు తెలంగాణ ప్రజల వాడుకభాష గురించి చర్చ వచ్చేసరికి ప్రామాణిక భాష కొలమానంతో వెనుకకు వెళ్లి పత్రిక, గ్రంథభాషను ముందుకు తెచ్చి విజయం సాధిస్తున్నరు. ఆధిపత్యం కోసం అప్పుడు శాస్త్రీయదృష్టిని అవలంబించి ఇప్పుడు ఆధిపత్యం కోసమే శాస్త్రీయ దృష్టిని పక్కకు పెడుతున్నరు. ఇప్పటి ప్రామాణిక భాషావాదం కౌగిల్లో తెలంగాణ భాష ఉక్కిరిబిక్కిరయి పోతంది.

రెండు ప్రాంతాల భాష, సంస్కృతుల వికాసంలో ఉన్న వ్యత్యాసాలకు మూలహేతువులు ఈ ప్రాంతాల వేరువేరు రాజకీయార్థిక, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులేనని గమనించాలె. 1953కు ముందు ఆంధ్రప్రాంతం మద్రాసు రాష్ట్రంలో భాగంగా బ్రిటిష్ పాలన కింద ఉన్నది, బ్రిటిష్ పాలకులు పెట్టుబడిదారీ వ్యాపార స్వభావం తెలిసిన వాళ్లవటం చేత అభివృద్ధిచేస్తూ దోచుకోవాలనుకున్నరు. ఆంధ్ర ప్రాంతంలో రైలు మార్గాలు నిర్మించి, నీటి ప్రాజెక్టులు కట్టి, వ్యవసాయ, వ్యాపారాల్ని అభివృద్ధి చేసింద్రు. ఆంధ్రుల మనసులు చూరగొని అభిమానం సంపాదించి పనులు చేయించుకొనేతందుకు ఆంధ్రభాషను ప్రోత్సహించింద్రు. పరిశోధన, పుస్తక రచన, ప్రచురణలను, సంఘ సంస్కరణలను, విద్యను, పత్రికా రచనలను, మత ప్రచారాన్ని బాగా ప్రోత్సహించింద్రు. ఈ అవకాశాల ప్రేరణతో విద్యావంతుల, రచయితల, ప్రచురణకర్తల, పత్రికా నిర్వాహకుల సంఖ్య బాగా పెరిగింది. వ్యవసాయం, వ్యాపారం, విద్య, రాజకీయం, సాహిత్యం గణనీయంగా అభివృద్ధి చెందినయి. కానీ, తెలంగాణ పరిస్థితి పూర్తి భిన్నంగా ఉండింది. నిజాంది ఫ్యూడల్ స్వభావం గనుక అణచివేత ద్వారా దోచుకోవాలనుకున్నడు. హైద్రాబాద్ సంస్థానంగా ఉన్న తెలంగాణ నిజాంఫ్యూడల్ నియంతృత్వం కింద కనీస వెసులుబాటుకు కూడా నోచుకోలేదు. ఈ ప్రాంతంలో అధిక సంఖ్యాకులు తెలుగు మాతృభాషగా కలిగి ఉన్నప్పటికీ అన్ని దశల్లో తెలుగు దారుణంగా అణచివేయబడింది. పాలనా భాషగా, కోర్టు భాషగా, బోధనా భాషగా ఉర్దూ రాజ్యం చేసింది. ఇక్కడి ప్రజా సమూహాల ఇతర మాతృభాషలన్నీ నిర్బంధంలో నలిగిపోయినయి. తెలుగులో బోధన జరపటానికి పాఠశాలలు లేవు. తెలుగు ప్రైవేటు బడులు ప్రారంభించాలన్నా నిజాం పాలకుల అనుమతి పొందాల్సి ఉండేది. దేవులపల్లి రామానుజరావు అభిప్రాయం ప్రకారం నూరింట ఆరుగురు మాత్రమే అక్షరాస్యులుగా ఉన్నరు. భయంకరమైన వెట్టిచాకిరీ అమల్లో ఉండేది. నిజాం తొత్తులైన జమిందార్లు, జాగీర్దార్లు గ్రామాల్లో ఇష్టారాజ్యం చేసేవారు. 'బాంచెన్, కాల్మొక్త' అనేదాంక కష్టజీవులకు కాలం గడువలేదు. పంటల్లో ఎక్కువభాగం పన్నులకిందికే పొయ్యేది. మాన, ప్రాణాలకు కొంచెమన్నా రక్షణలేదు, కొద్ది చైతన్యాన్ని కూడా ఎదగనిచ్చేటోళ్ళు గాదు. చిన్న సభ పెట్టుకోవటానికి గూడ అనుమతి తీసుకోవాలె. పత్రికలు, గ్రంథ ప్రచురణకు ఎంత మాత్రమూ వీల్లేకపోయింది. సామాజిక, ఆర్థిక దోపిడీ విపరీతంగా కొనసాగింది. ఈ దశల్లో అభివృద్ధికీ, సాంస్కృతిక వికాసానికీ ఎంత మాత్రమూ వీల్లేకుండా ఉన్న తెలంగాణ వారికీ, ఆర్థికంగా మిగులు, సాంస్కృతికంగా మెలుకువపొందిన ఆంధ్రప్రాంతీయులకూ మధ్య సంబంధాలు పెరిగినయి. మద్రాసురాష్ట్రంలో చిన్నచూపుకు గురై అవమానపడిన ఆంధ్రులు ఆంధ్రభాష ఉద్యమాలు ప్రారంభించారు. తెలంగాణ ప్రజల్లో ఆంధ్రభాషాభిమానం, సోదరభావం పెంపొందించేటందుకు కృషి చేస్తూనే నాయకత్వం వహించింద్రు. అప్పటికే నిజాం పాలనలో తండ్లాడుతున్న తెలంగాణ ప్రజలు విముక్తి కోసం ఆంధ్రా ప్రగతిశీలుర నేతృత్వంలో తీవ్రమైన పోరాటాలు చేసింద్రు. భూమికోసం భుక్తికోసం జరిగిన పోరాటాలలో మునిగిపోయి భాషా సంస్కృతులను పట్టించుకోలేదు. ఉద్దేశ్యపూర్వకంగా అయినా కాకపోయినా అప్పటినుంచి తెలంగాణ ప్రజల భాషమీద ఆంధ్రభాష పైచేయి అయింది. తర్వాత జరిగిన విశాలాంధ్ర ఉద్యమం, ఆంధ్రప్రదేశ్ అవతరణలతో తెలంగాణ భాష సంస్కృతుల మీద ఇనుపపాదం పడింది. ప్రజాస్వామిక వాదుల మీద బూర్జువార్గం విజయం సాధించి అధికారంలోకి రావడంతోని తెలంగాణ వనరులు, సంపదలు అటువైపు మరలించబడినయి.

ఒక దశలో అధికుని చేతిలో అవమానాలు పడి న్యూనత నెదుర్కొన్న వ్యక్తి మరో దశలో అవకాశం చిక్కితే ఇంకొక తక్కువతని ముందు తన ఆధిక్యతను ప్రదర్శించి తృప్తి పడుతడు. తమిళ ప్రజల చేతిలో సాంస్కృతిక అవమానాలు పొందిన కోస్తాంధ్ర బూర్జువా వర్గం తెలంగాణ భాష, సంస్కృతుల్ని అవమానిస్తూ ఆధిపత్యం నిరూపించుకోగలిగింది. ఆంధ్రాపాలనలో తెలంగాణ ప్రజల పరిస్థితి పెనం మీంచి పొయ్యిల పడ్డట్టయింది. భూమి, నీరు, కరెంటు మొదలైన ముఖ్య వనరులు కోల్పోవటంతో పాటు భాష సంస్కృతులపరంగా అడుగడుగునా అవమానాలు పొంది తల్లడిల్లుతున్నరు. 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' ఆనాటి నినాదమైతే విశాలాంధ్రలో 'విశాల' భావన లోపించి ప్రజారాజ్యంలో 'ప్రజా'దృష్టి లోపించి ఉత్త ఆంధ్రరాజ్యం మిగిలింది.

భాష ద్వారా మానసిక బానిసత్వం సాధించవచ్చునంటడు గుగీ. ఆంధ్రభాష చేసిందదే. తెలంగాణ ప్రజల మనసుల్ని బానిసలుగా చేసుకోగలిగింది. నిజాం రాజు జమీందార్ల పాలనలో

అణచివేతలో తెలంగాణా బతుకులు తల్లడమల్లడమయితే, ఆంధ్రా బూర్జువాసర్కారు సమ్మతి తయారు చేసుకొని దోపిడీ బానిసత్వాల్ని ఇక్కడి ప్రజల మీద రుద్దుతున్నది. మిగులు ఆదాయంతో పెట్టుబడులు పెట్టి ప్రసార సాధనాలమీద, ఉత్పత్తి సాధనాలమీద, మార్కెట్ వ్యవస్థమీద పట్టు సంపాయించిన ఆంధ్రపాలకులు రాజకీయాధికారాన్ని స్థిరపర్చుకొని తెలంగాణ సాంస్కృతిక ప్రత్యేకతల మీద దాడికి పూనుకుంటున్నరు. తెలంగాణ భాషకు సాహిత్య గౌరవాన్నీ, జీవన విధానానికి సాంఘిక గౌరవాన్ని, సాంస్కృతిక గౌరవాన్ని ఇవ్వకుండా కుంటివాదాలు లేపుతుండ్రు.

ప్రతి ప్రాంతానికి కొన్ని జనసమూహాలుంటాయి. ఆ జనసమూహాల జీవన విధానమే ఆ ప్రాంత ప్రజల సంస్కృతిగా భావిస్తం. జీవితంపట్ల మానవుడికుండే ఇచ్ఛలో సంస్కృతి వ్యక్తమయితుంది (గోర్కి). వ్యష్టి, సమిష్టి జీవన రూపాలన్నింటిలో కన్పించే ప్రాపంచిక అవగాహన సంస్కృతి అని చెప్పొచ్చు (గ్రాంసీ). తెలంగాణ ప్రాంతానికి భౌగోళికంగా, చారిత్రకంగా ఉన్న ప్రత్యేకతలు ఇక్కడి జీవన విధానం రూపొందేతందుకు ముఖ్యపాత్ర వహించినయి.

భౌతికంగా ఎన్నో ప్రజోపయోగ వనరులున్నప్పటికీ రాజకీయ కారణాల వల్ల ఈ ప్రాంతం వెనుకబడి ఆర్థిక జీవనం మీద ప్రతిఫలించింది. తెలుగు, కన్నడ, ఉర్దూ, మరాఠీ సంస్కృతులు పరస్పరం ప్రభావితమై తెలంగాణ సంస్కృతికి ప్రత్యేకతలు అద్దింది. ఇన్నేండ్లనుంచి పరస్పర గౌరవాలు కాపాడుకున్న సాంస్కృతిక ప్రత్యేకత ఇప్పటి ఆంధ్ర సంపన్న సంస్కృతిలో కొట్టుకుపోతున్నది. ఉర్దూపదాలు కలిసిపోయి తెలంగాణ "తౌరక్యాంధ్ర" గా పిలువబడినా, తెలుగుపదాలు కలుపుకొని ఉర్దూ "దక్కనీ ఉర్దూ"గా గుర్తింపు పొందింది. తెలంగాణ జీవనంలో కన్నడిగులు, కన్నడిగుల జీవనంలో తెలంగాణీయులు కలిసి సహజీవనం చేస్తూనే ఉన్నారు. కానీ ఐదు దశాబ్దాల జీవనంలో తెలంగాణ భాష ఆంధ్రమాటలు, యాస కలుపుకొని ఆంధ్రభాష ననుకరించిందే గాని ఎన్నడూ తెలంగాణ మాటల్ని, యాసను, ఉచ్చారణను ఆంధ్రభాష తనలో కలుపుకోలేదు. పైగా అస్పృశ్యంగానే ఉంచగలిగింది. సంస్కృతి విషయంలో కూడా అంతే జరిగింది. విభిన్న సంస్కృతులతో ఐక్యజీవనం గడిపి కలువగలిగిన తెలంగాణా సంస్కృతి ఇయ్యాల్ల ఆంధ్ర సంపన్నవర్గాల సంస్కృతి చేతిలో విపరీతమైన ఆత్మన్యూనతకు లోనవుతున్నది. ఆంధ్ర సంస్కృతి అవహేళనలో తెలంగాణ అస్తిత్వాన్ని కోల్పోతున్నది.



తెలంగాణ ప్రజలకు భాషరాదని, సంస్కృతి తెలియదని బండ సంస్కృతి, బగ్గడి (మోటు) సంస్కృతి అని మాట్లాడుతున్నరు. తెలుగువారై ఉండి, హైద్రాబాద్‌లో ఉండి తెలుగువాళ్ల పాలనలో ఉండి ఈ ఐక్య రాష్ట్రంలో పరాయి భావన ఎదుర్కొన వలసి వస్తున్నది. నిజాయితీ వుండీ, కష్టం చేసీ, పోరాటాలు చేసిన చరిత్ర వుండీ, తెలంగాణ వాళ్లు తెలివిలేనివాళ్లని, సోమరిపోతులని, పనిచేతకాని వాళ్లని ఆంధ్ర పాలకసంస్కృతి అవహేళన చేస్తూ అణచివేస్తున్నది. తెలంగాణ ప్రజలకు నిజాయితీ ఎక్కువ. నమ్మిన ఆశయాల కోసం ప్రాణాలిచ్చిండ్రు. నిలబడ్డరు. నిలబెట్టిండ్రు. తెలంగాణ సంస్కృతిలో తిరుగుబాటు స్వభావం ఎక్కువ. ప్రపంచంలోనే గుర్తింపు పొందిన ఒక గొప్ప పోరాటాన్ని నిర్మించిండ్రు. పనిచేసి పనిని గౌరవించటంలో పని సంబంధాల ద్వారా ఎన్ని సంపదలు సృష్టించగలిగినారో ఆనాడు నిజాం, ఈనాడు ఆంధ్రా పాలక వర్గ విలాసాలే నిదర్శనం. ఒక్క తెలంగాణనే కాదు, వెనుకబడిన జాతులన్నీ, సంస్కృతులన్నీ, ప్రత్యేకతలను, శ్రమను, నిజాయితీ, మానవీయ విలువలు, ఆర్తి, పోరాటసంప్రదాయాలు కలిగి వుంటయి. ఆంధ్రానే కాదు అన్ని అభివృద్ధి చెందిన సంస్కృతులు దోపిడీ స్వభావం, మ్యానిపులేషన్, పైరవీ, వ్యాపార విలువలు, ఆధిపత్య సంప్రదాయాలు కలిగివుంటయి. అయితే అభివృద్ధి చెందిన సంస్కృతులు, పైరవీ సంస్కృతులు వెనుకబడిన సంస్కృతులను, పనిచేసే సంస్కృతులను ఎగతాళి చేస్తయి. పెత్తందారీ విధానాలు తమ బూర్జువా సంస్కృతుల్ని ఇతర సంస్కృతుల మీద రుద్ది దోపిడీ తొవ్వలు సాపు చేసుకుంటాయి.

దిన పత్రికలన్ని ఆంధ్రపెట్టుబడిదారులవి (రెండు పత్రికలు రాష్ట్రేతరులవి ఉన్నప్పటికీ కీలకస్థానాల్లో ఉన్నవాళ్లు ఆంధ్రావాళ్లే) అవటం వల్ల తెలంగాణమాటలు, భాష ఉపయోగించకుండా జాగ్రత్తగా కావలికాస్తుండ్రు. తెలంగాణ విలేకరులు తమ భాషలో వార్తలు రాస్తే వాటిని ఎడిట్‌చేసి ఆంధ్రభాషకి అనువదిస్తున్నారు. శ్రమదానంతో 'లొట్టపీసుచెట్లు' తీసేశారని రాస్తే (మెదక్‌జిల్లా ఎడిషన్‌లోనే) దాన్ని 'పిచ్చిమొక్కలు' అని మార్చారు. పిచ్చి మొక్కలు ఇక్కడ ప్రజలకు తెలువవు. ప్రెస్ అకాడమీ ఛైర్మన్ వార్తా రచన మెలకువలు చెప్పేటప్పుడు 'బట్టలు' అని రాయకూడదు, 'గుడ్డల'ని రాయమని పేపర్ సమర్పించిండు. 'బట్టలు' అని రాస్తే ప్రింటింగ్ తప్పు పడితే బూతవుతుందని వాదం. ఆ ప్రమాదం చాలా మాటలకు ఏర్పడవచ్చు. 'తుపాన్' గురించి రాస్తే వార్తవుతది. తీవ్రమైన కరువు గురించి రాస్తే వార్తకాదు. దిన, వారపత్రికల్లో రెగ్యులర్‌కాలమ్ పేరుతో తెలంగాణ

భాషను ఘోరంగా అవమానిస్తున్నరు. చదివే వాళ్ళకెంత బాధయితదో కెరీర్ చూసుకునే రచయితలకు అర్థం కాదు. తెలంగాణ వాళ్లు ఆడపిల్లను 'తోలుకరావటం' అంటరు. అది పశువులకు వాడే మాటనీ, తెలంగాణ వాళ్లకు స్త్రీలను గౌరవించటం తెలువదని ఒక నెల్లూరు రచయిత్రి పెద్ద వ్యాసమే రాసింది. 'తోలుక' రావటం బదులు 'తీసుక' రావటం అనాలని సంస్కరించే ప్రయత్నం చేసింది మూడు కోట్ల మంది మాట్లాడే భాషను, పలుకుబడిని అవహేళన చేస్తూ ఆ వ్యాసం సాగింది. 'తీసుకరావటం' అనే మాట తెలంగాణ సంస్కృతిలో జడపదార్థాలకు, నిర్జీవ పదార్థాలకు వాడతారు మరి.

తెలంగాణ భాషంటే సినిమావాళ్లకు మరీ అగ్వ. లెక్కేలేదు. సినిమాలల్ల జోకర్ల భాష, విలన్ల, రౌడీల భాషయిపోయింది. తెలంగాణ పేరుల మీద ఆంధ్రప్రాంతంలో సినిమాలు తీసి తెలంగాణల డబ్బులు చేసుకుంటుంండ్రు. తెలంగాణ భాష పోలీసోళ్లకు పెట్టి ఎగతాళి చేస్తరు. 'నిజహీరో' లు తెలంగాణ వాళ్లయితే 'తెరహీరో' లకు ఆంధ్రభాష పెడుతుంండ్రు. ప్రచారానికి ఇక్కడి పాటలు కావాలె. మాటలొద్దు. 'యాదగిరి' పేరు పెట్టుకొన్నందుకు పేరును హాస్యం చేసింండ్రు. కరీంనగర్ అమ్మాయి కోడలుగా వద్దని, అది మాట్లాడితే లొల్లి (గొడవ) పెట్టినట్టుంటదని ఒక ఆంధ్రమాత తన కొడుకును ఒక సిన్మాలో బతిమిలాడుతది. ఒక ముఖ్యమంత్రి తెలంగాణ భాష మాట్లాడితే ఆయన దిగిపొయ్యేదాంక అవహేళన చేసిందొక పత్రిక. దానికి కార్టూనిస్టు అసహ్యపు బుద్ధులు మరిన్ని. ఆ భాష అసలైన ప్రజల భాష అన్నందుకు తెలంగాణ కవిని ఇజ్జత్ తీసిందదే పత్రిక. రేడియో, టీవీల్లో తెలంగాణ భాషను ఎంత ఖూని చెయ్యాల్నో అంతా చేస్తున్నరు. ఒక ఛానల్లో విద్యావంతురాలై ఉద్యోగం చేసే ఒక తెలంగాణ మహిళ భాషను, అభిప్రాయాల్ని ఒక ఆంధ్రా గృహిణి అవహేళన చేస్తుంది. ఇట్లా వందలాది ఉదంతాలు చెప్పొచ్చు.

తెలంగాణలో అతిథి మర్యాదగా 'చల్ల' ఇచ్చే సంప్రదాయముంది. దాన్ని 'చల్ల' అనగూడదు 'మజ్జిగ' అనాలనీ, కనీసం బట్టర్‌మిల్క్ అనాలని బల్మీటికి రుద్దుతున్నారు. 'చల్ల'గ ఉండేది 'చల్ల'. తెలంగాణ అంతట వాడుకలో ఉన్న ఎన్నో మాటల్ని అణచి వేస్తుంండ్రు. ఈ ఎనిమిదో దశాబ్దం తర్వాత ఆంధ్రుల వలస బాగా పెరిగింది. ఆంధ్రా హోటళ్లు విపరీతంగా వెలిసినయి. తెలంగాణ యజమానులు తెలంగాణ కస్టమర్స్ కోసం తెలంగాణ జిల్లాల్లో పెట్టిన హోటళ్లకు కూడ 'ఆంధ్ర భోజనం దొరుకును' అని బోర్డులుంటున్నయంటే పరిస్థితి ఎంత తీవ్రంగా ఉన్నదో అర్థం చేసుకోవలసి ఉన్నది.



ఒకజాతి, ప్రాంత సంస్కృతిలో వేషభాషలు, ఆహారపానీయాలు, ఆచారవ్యవహారాలు, కళాసాహిత్యాలు ముఖ్యపాత్ర వహిస్తాయి. ఇయ్యాల్ల తెలంగాణ మాటలే కాదు. వంటకాలన్నీ 'వలస' వంటల దుమారంతో కొట్టుకుపోతున్నాయి. పప్పుచారు, పచ్చిపులుసు పోయినయ్, సాంబారు, రసం వచ్చినయ్. తమిళులు ఆంధ్రుల మీద రుద్దినవి కొన్ని, ఆంధ్రులవి కొన్ని. మొత్తం తెలంగాణ ప్రజల రుచుల మీద రుద్దుతున్నరు. "స్వగృహఫుడ్స్" వచ్చినంక ఆంధ్ర వంటకాల ఆధిపత్యం మరింత పెరిగిపోయింది. వలసవాదులు అంటగట్టిన రుచులు, పండుగలు. అంతర్గత వలసలు రుద్దుతున్న రుచులు, పండుగలు తెలంగాణ సాంస్కృతిక జీవనం మీద దాడి చేస్తున్నాయి.

ఆంగ్లభాషలాగే ఆంధ్రభాష. ఆంధ్ర మాటలు మాట్లాడటం ఫాషన్ కింద ఎడ్యుకేషన్ కింద లెక్కించబడుతున్నది. తెలంగాణల తెలుగుకోసం ఉద్యమించిన సంఘానికి 'ఆంధ్రమహాసభ' అనే పేరు. తెలంగాణ సంస్కృతి వికాసం కోసం వెలిసిన మొదటి రెండు గ్రంథాలయాలకు ఆంధ్ర ప్రభువుల పేర్లు - హైద్రాబాద్‌లో కృష్ణదేవరాయఆంధ్రభాషానిలయం, వరంగల్‌లో రాజరాజనరేంద్ర ఆంధ్ర భాషాకేంద్రం. ఇప్పటిపాలకులకయితే అసలు గ్రంథాలయాల మీదే శ్రద్ధ ఉండదు. మూసేస్తే ఖర్చు తగ్గుతుందని ఆలోచిస్తరు. తెలంగాణ దేవాలయాలమీది శిల్పకళను పరిశోధించి జాయప్పసేనాని రచించిన "నృత్తరత్నావళి" పరిశీలించి కాకతీయుల కాలంనాటి నాట్యకళను సంభావించి రూపొందించిన తెలంగాణ సంప్రదాయనృత్యానికి 'ఆంధ్రనాట్యం' అని పేరు పెట్టడంలో సమ్మతి కోసం పడే 'తౌల్యం' వున్నది.

తెలంగాణ జిల్లాల్లో మూడు రేడియో స్టేషనులుంటే ఒక్క కేంద్రంలో నన్నా తెలంగాణ భాషా సంస్కృతుల కార్యక్రమాలుండవు. ఉన్న ఒక్క తెలంగాణ విశ్వవిద్యాలయంలోగాని, రాజధానిలోని విశ్వవిద్యాలయాల్లో గాని ఒక్క తెలంగాణ సాహిత్య అధ్యయనముండదు. ఒక్క తెలంగాణ కవి ప్రత్యేక అధ్యయనాలుండయి.

భాష అరువు తెచ్చుకుంటే వాటితోపాటు భావజాలం, జీవితం కూడా వచ్చి చేరుతయి. భాష పరాయీకరణ చెందితే సృజనాత్మకత కోల్పోతది. తమది కాని జీవితం ప్రవేశిస్తే సజీవ కళారూపాలు సృష్టించలేరు. కరీంనగర్, ఆదిలాబాద్ ప్రజాపోరాటాలు చిత్రిస్తూ తెలంగాణ భాషలో సాహిత్యం వస్తే ఇవి అర్థం కావని, చదవలేమని ప్రగతివాదులు సైతం ఉడుక్కున్నరు. తెలంగాణ కవుల కవిత్వంలో శిల్పం లేదని, రొటీన్ ఉంటుందని విమర్శకులు వాటిని పట్టించుకోలేదు. ఇక్కడి కవుల జీవన సంస్కృతుల, విశ్వాసాలను చులకన భావంతో

చూసిండ్రు. వలస, వాణిజ్య సంస్కృతుల ప్రభావంతో స్థానిక ప్రజల సజీవ సంస్కృతిని అణిచివేసే శిల్పాన్ని పదును పెడుతుండ్రు. విద్యావిషయక, ఉద్యోగవిషయక రాత, మౌఖిక పరీక్షల్లో తెలంగాణ విద్యార్థులు తమ భాషను ఉపయోగించడానికి వీల్లేని దుర్మార్గమైన పరిస్థితి తీసుకొచ్చిండ్రు. ఇంగ్లీషు నేర్చినట్లే ఆంధ్ర భాషను నేర్చుకునేందుకు విద్యార్థికి ఎంత సమయం, ప్రతిభ వ్యర్థమైపోతుందో గమనించాలె. ఇక్కడి అధ్యాపకులు ముఖ్యంగా తెలుగు అధ్యాపకులు తెలంగాణ భాష, మాటలు ఉపయోగిస్తే తెలంగాణ విద్యార్థులు కూడా చులకనగా చూసే పరిస్థితి ఉన్నదంటే, సిన్మాలల్ల తెలంగాణ భాష విని, చూసి తెలంగాణవాళ్లే నవ్వుకునే పరిస్థితి ఉన్నదంటే మానసిక బానిసత్వం, ప్రచారబలం ఎంత తీవ్రంగా పరిణమించిందో అర్థం చేసుకోవాలె.

తక్కువ భాషలని, ఎక్కువ భాషలని ఉండవు. తక్కువ సంస్కృతులు ఎక్కువ సంస్కృతులు ఉండవు. భావనలు, భావజాల విలువల ఆధారంగా ప్రమాణాలు ఏర్పడతాయి. ఏ ప్రాంత ప్రజలభాష, సంస్కృతులయినా వివక్షకి గురయితే వికాసం పొందలేవు. ఉద్దేశపూర్వకంగా వివక్షలు, విభేదాలు కొనసాగిస్తున్న వ్యవస్థలు ధ్వంసం చెయ్యటానికి ఉద్యమించాలె. అన్ని రకాల ఆధిపత్యాలు ఛేధించడానికి కొట్లాడాలె. వివక్ష, ఆధిపత్య వ్యవస్థలు అదృశ్యమై ప్రజాస్వామిక భావనలేర్పడినప్పుడే ప్రజల భాష సంస్కృతులు కళలు వికాసం పొందుతయి.

*- భూమిక, తెలంగాణ ప్రత్యేక సంచిక, మే - ఆగస్టు 1998*

*- ముద్దెర, తెలంగాణ ప్రాంతీయ సాహిత్యవ్యాసాలు, అక్టోబర్ 2005*

*- తెలంగాణ - వర్తమానం, విశ్లేషణవ్యాసాలు 2005*



# తెలంగాణ కవిత్వం - జీవనరేఖలు

రాజకీయంగా విస్తృత ప్రచారంలోకి వొచ్చిన 'తెలంగాణ' సాహిత్యంలో తన అస్తిత్వాన్ని దేవులాడుకుంటుంది. ఒకే రాష్ట్రం పేరుతో అధికారం కోల్పోయి సంపద నష్టపోయినట్టే ఒకే భాష పేరుతో చరిత్ర కోల్పోయి సర్వం జార విడుచుకుంటున్న సంగతి ఎరుక పర్చుకుంటంది. విశాలాంధ్ర భావనలో మురిసిపోయి ఆంధ్ర సాహిత్య చరిత్రల ఐక్యమై తెలంగాణ సాహిత్యం అన్యాలమైపోయింది. ఆంధ్రరచయితల భజన మైకంల తెలంగాణ రచయితలు తమను తాము యాది మరిసిండ్రు. మహారచనల అనుకరణలో ఇక్కడి భాషను ఇక్కడి మూలాలను వొదులుకున్నరు. తెలంగాణ జీవితాన్ని పట్టుకొని యాల్లాడిన రచయితలకు సుతా గుర్తింపు లభించలేదు.

బయట రాజకీయాలున్నట్టే సాహిత్యంల రాజకీయాలుంటయి. అధికార రాజకీయం చరిత్ర నిర్మించినట్టు అధికార సాహిత్యం చరిత్ర రాసిపెడ్తది. అన్ని విధాలుగా నష్టపోయిన తెలంగాణ గురించి ఇన్నేండ్ల తర్వాత మల్ల ఆలోచన షురువైంది. తిరిగి తన చరిత్ర తాను క్రోడీకరించుకొనేతందుకు సిద్ధపడుతున్నది.

తెలంగాణకు కవులున్నరు. కవిత్వ చరిత్ర వున్నది. లేనిదల్ల స్పృహ. తెలంగాణ సోయి లేకపోవడం వల్ల చరిత్ర నిర్మాణంల రచనా నిర్మాణంల వెనకబడ వలసి వొచ్చింది. చరిత్రల తెలంగాణది నిరంతర పోరాట గాథ. ఏటికేతంబట్టి ఎయిపుట్లు పండిచ్చి ఎన్నడూ మెతుకెరుగని దీనావస్థ తెలంగాణది. పైగా అంతస్థితిలోనూ కష్టం చెయ్యరాదని, తామే నేర్పినమని వలసాధిపతులు మాట్లాడుతుంటే తట్టుకోలేక తండ్లాడుతున్నది. బండెనుక బండి పదహారు బండ్లు గట్టి నిజాంనవాబును సాగనంపి, నెహ్రూ సైన్యాల నెదిరిచ్చి ఇప్పటికి అణచివేతకు, ఆధిపత్యానికి వ్యతిరేకంగ మడమ తిప్పకుంట పోరాడుతనే ఉన్నది. ఒడిదొడుకులను సవరిచ్చుకోలేక, కష్టాల నుంచి గట్టెక్కలేక సతమతమైతనే ఉన్నది. ఈ దశల సుత తెలంగాణకు చరిత్ర, సంస్కృతి లేదని తులనాడే ఆంధ్రుల అవమానాలను,

అవహేళనలను భరించలేకపోతంది. ఇట్లా అన్ని సందర్భాలు, సమయాలు ఏదో స్థాయిలో కవిత్వంలో, వ్యక్తీకరించబడుతనే ఉన్నయి. నిజాం జమానల తెలంగాణ ప్రజల బాధలు అనన్యమైనవి. 84 రకాల పన్నులు అమల్లో వుండటం వల్ల చేసిన కష్టమంత పన్నులు కట్టడానికే పొయ్యేది. మిగులు లేకపోవడం వల్ల సాంస్కృతిక వికాసం వెనుకబడ్డది. దేశానికి వెన్నుముకగా కొనియాడబడే రైతు దయనీయస్థితిని కవులు ఆవిష్కరించిండ్రు. గంగుల శాయిరెడ్డి 'కాపుబిడ్డ', వానమామలై జగన్నాథాచార్యులు 'రైతు రామాయణం', వెల్దుర్తి మాణిక్యరావు 'రైతు' ప్రచురించినారు.

*" కాపు పండించు బంగరు పంట సగము భూ*
*స్వామికే దక్కె సగములోన*
*పాలికాపును పనిపాటువారలు నింక*
*నీరడి సుంకరి లేరెవెంట*
*పోను మిగతలోన కాణాచితాబెట్టు*
*బడిదారు లేడె వెంబడి, తుద తుద*
*కా మిగతయు సొంతమని సంతసించగ*
*వీలెక్కడిది శిస్తు బెడదలేదె*
*అక్రమంపు దండుగలు లేవె..."*

వానమామలై జగన్నాథాచార్యులు 'రైతుల' కష్టాలు కడగండ్ల కవిత్వీకరించిండు. ఆనాటి పరిస్థితులకు స్పందించి పొట్లపల్లి రామారావు ఆర్ద్రమైన కవిత్వం వెలార్చినాడు. ఆ ఉద్యమంల కవులు స్వయంగా పాల్గొనటం విశేషంగా చెప్పుకోవాలె. రైతుల దీనస్థితిని, ధిక్కారాన్ని దాశరథి కృష్ణమాచార్యులు అద్భుతంగ చిత్రీకరించిండు.

*ప్రాణములొడ్డి ఘోరగహనాటవులం పడగొట్టి మంచిమా*
*గాణములన్ సృజియించి ఎముకల్ నుసిచేసి పొలాలు దున్ని, భో*
*షాణములన్ నవాబునకు స్వర్ణము నింపిన రైతుదే తెలం*
*గాణము రైతుదే ముసలినక్కకు రాచరికంబు దక్కునే*

ఉద్యమానికి కేంద్రం నల్లగొండ. ఉద్యమిస్తున్న ప్రజల మీద రజాకార్ల దుర్మార్గాలు చెప్పనలవి కాదు. గృహదహనాలు, మానభంగాలు, పంట దహనాలు భయానకంగా ఉండేటియి. కాళోజీ అన్యాయాల్ని ఆగ్రహంగ ప్రశ్నించిండు.



*నల్లగొండలో నాజీవృత్తుల*
*నగ్న నృత్యమింకెన్నాళ్ళు?*
*దొంగలు దొంగలు ఊళ్ళపంచుకొని*
*దొరలై వెలిగే దెన్నాళ్లు?*
*బాధలు పెట్టి పలుకనీయని*
*పాపుల భయమింకెన్నాళ్లు?*

అడ్లూరి అయోధ్యారామకవి, యాదగిరి, సుద్దాల హన్మంతు లాంటి ఎందరో కవులు అప్పటికప్పుడు పాటలు కట్టి, పాడి, చైతన్యం పెంచిండ్రు.

*చాలిచాలని చింపులంగీ*
*సగం కాలిన చల్ల గాలికి*
*గోనె చింపు కొప్పెర బెట్టావా*
*ఓ పాల బుగ్గల జీతగాడా పాలు మరిచి ఎన్నాళ్లయ్యిందో*
*కొలువు కుదిరి ఎన్నాళ్లయిందో*

హన్మంతు పాటకు కరిగిపోని వాళ్లుండరు. అడుగడుగునా కుంచెడు జీతానికి నెలంతా పనిచేసే బాల్యం, హృదయాన్ని ద్రవింపజేసే అనుభవాలు బోలెడు తటస్థపడుతయి. సాకు ఏదైనప్పటికీ తెలంగాణ గురించి ఆంధ్రులు రాసిన కావ్యాలకు ఎక్కువ గుర్తింపు రావడం యాదృచ్ఛికమేమీ కాకపోవచ్చు.

యాభయోదశకం భాషావాదాలు ముందుపడిన తర్వాత తెలంగాణకు మరోసారి అన్యాయం జరిగింది. ఆంధ్ర, తెలంగాణ రెండుజాతులు రెండు రాష్ట్రాలు ఒక జాతిగా ఒక భాషగా అవతరించిన తర్వాత ఒక రాష్ట్రం ఏర్పడ్డది. అప్పటిదాంక తొక్కులాడిన దాశరథి మహాంధ్రోదయానికి మురిసిపోయిండు. తెలంగాణ జీవన చిత్రాల్ని 'ఋతుచక్రం' గా వర్ణించిన సి. నారాయణరెడ్డి భారీ ప్రాజెక్టు నిర్మాణానికి ఖుషీ అయి 'నాగార్జున సాగరం' రచించిండు. ఆ సమయంలో కవులకు మార్గదర్శనం చెయ్యవలసిన కవులు పలుకుబడుల్లో పరపతుల్లో కూరుకుపోవడం వల్ల తర్వాతి తరం పథనిర్దేశం చేసుకొనేతందుకు చాలా సమయం పట్టింది.

వే. నరసింహారెడ్డి, సుప్రసన్న, సంపత్కుమార 'చేతనావర్తం', మాదిరాజు రంగారావు 'యుగసంకేతం' నైరూప్యంగా రచించినారు. జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు దిగంబర

కవుల్తో పాటు సంచలనం సృష్టించినారు. వరవరరావు, లోచన్, కిషన్‌రావు తదితరులు 'తిరగబడు' కవులుగా రాజకీయ వాతావరణాన్ని రంగం మీదికి తెచ్చినారు.

కోస్తా ఆంధ్రుల అన్యాయాలకు సహించలేని స్థితిలో 1969లో ప్రత్యేక రాష్ట్రం కోసం ఉవ్వెత్తున ఉద్యమించింది తెలంగాణ. కవులెవ్వరూ ఆ ఉద్యమాన్ని పట్టుకోలేక పోయింగ్రు. బహుశా కవుల తటస్థం వెనుక, సంకోచాల వెనుక పరాయీకరణ కొంత, అధికార రాజకీయాల ఒత్తిడి కొంత, సాహిత్య పీఠాల పలుకుబడి కొంత ఉండవచ్చు. కనీసం ప్రత్యేక తెలంగాణ ఉద్యమంల వొచ్చిన పాటలన్నా రికార్డు కాకపోవడం విచారించదగ్గ విషయం. ఆలస్యంగనయినా కాళోజి ప్రాంతాభిమానాన్ని ప్రకటించిండు.

*'ప్రాంతం' వారీ రక్షణ పనికిరాదు అన్నప్పుడు*
*ప్రత్యేకంగా రాజ్యం పాలుగోరడం తప్పదు'*

అని వెన్నుదన్నుగా నిలిచిండు.

ప్రత్యేక రాష్ట్రవాదాన్ని సమర్థిస్తూ కవిత్వం రాకపోయినప్పటికీ ఆ స్ఫూర్తితోటి తెలంగాణ భాషలో కవిత్వం వొచ్చింది. టి. కృష్ణమూర్తి యాదవ్, దేవరాజు మహారాజు, పంచరెడ్డి లక్ష్మణ, భానుమూర్తి, ఎన్.గోపి తదితరులు తెలంగాణ భాషల కవిత్వం రాసింగ్రు. కేకలు, జీవనాడి, సృజన, స్రవంతి, వేకువ పత్రికలల్ల తెలంగాణ భాషల కవితలు వొచ్చేటియి.

*గింత ఇల్లు ఆకిలిలేదు గని దేశమంత మాదేనంట*
*శేతికొక్క పైసరాదుగని బ్యాంకు రునాలన్ని మాకేనంట*
*మీద మొగులును, కింద బూదేవిని శెర్లనీల్లను, నీల్లల్లశాపను*
*శెట్ల పూలను, పూలసుట్టు పురుగుల్ని సూశిపెరిగినం*
*గంద్కే మీకండ్లకు పురుగులైనం గాదుండి*

అభివృద్ధి, సహకార రుణాల పేరుతో జరుగుతున్న తంతును దేవరాజు మహారాజు ఎత్తి చూపిండు. తెలంగాణ ప్రాంతం నిండ గిరిజన తెగలెక్కువ. తెగల జనావాసాల్ని తండలంటరు. తండల బతుకులు ప్రత్యేకతలు కలిగి ఉంటయి. టి. కృష్ణమూర్తి యాదవ్ కవితలో ఆ బతుకు చిత్రాల్ని రూపు కట్టిండు.

*తడికల పుడినుండి బేతంపుడి దాక తండలు*
*తండలకుతండలు అంగట్ల కలుస్తరు*
*కొత్తగూడెం అంగట్ల కట్టెలమ్ముకొని పూలు కొనుక్కోరు*
*పాత చింతపండు కొంతమసాల*
*పావెడు మంచినూనె సోలెడు నూకలు కొనుక్కుంటరు*
*రైలు ఎంతో దూరం పోతదిగని*
*ఆల్లు తండ దాటిపోరు*

1976 ఎమర్జెన్సీ తర్వాత తెలంగాణ జిల్లాలల్ల ప్రజ్వరిల్లిన రైతాంగ ఉద్యమాలు అందరి దృష్టినీ అకర్షించినయి. ఆర్థిక దివాళా, కుల దొంతర, భూ సంపద సృష్టించిన ఎగుడు దిగుడులు ప్రజల ఆలోచనలను తీవ్రంగ ప్రభావితం చేసినయి. ప్రజా ప్రతిఘటనోద్యమాలు కాలికింది దుమ్మును దొరల కండ్లల్లకి చిత్తినయి. వరవరరావు, గద్దర్, వర్గీస్, ఎన్.కె, చెరబండరాజు, సముద్రుడు, కౌముది, అల్లం నారాయణ, నారాయణస్వామి, సిహెచ్ మధులాంటి ఎందరో కవులు ఉత్తేజపరిచే కవిత్వం రాసినారు. గద్దర్ పదాల నిండ తెలంగాణ జీవితం పచ్చిపచ్చిగ అంటుకున్నది. సిరిమల్లె చెట్టుకింద లచ్చుమమ్మ తెలంగాణ ముసలితల్లులకు ప్రతీక. ముడతలు పడ్డ అనుభవాల సంపద ఆమె.

*మోకాల్లమట్టూకు బురదలో దిగబడి*
*ఎద్దోలె ఎనుకాకు వొక్కొక్క అడుగేసి*
*అయ్యో నాట్లేసినాట్లేసి లచ్చుమమ్మ*
*నీ నడుములే ఇరిగెనా లచ్చుమమ్మా*

గూడ అంజయ్య, సుద్దాల అశోక్, అందెశ్రీ, గోరటి ఎంకన్న తెలంగాణను అద్భుతంగా చిత్రికపట్టేటి పాటలు రాసింగ్రు. 'పరక శాపలకు గాలాలేసిన తురక పోరల' గురించి, 'పాతబట్టలా సామాన్లమ్మే బిచ్చగాళ్ళ' గురించి గోరటిఎంకన్న జీవద్వంతంగా పాటకట్టింగ్రు.

తెలంగాణ భాషలోని జీవాన్ని, జీవితంలోని సారాన్ని, మట్టిలోని మాధుర్యాన్ని, నుడికారం, పలుకుబడులతోని సుసంపన్నం చేసి ఇటీవల చాలామంది కవులు మంచి కవిత్వ ప్రయోగాలు చేస్తున్నరు. జూకంటి జగన్నాథం, సిధారెడ్డి, పప్పుల రాజిరెడ్డి, మోత్కూరి అశోక్‌కుమార్, ఐలేనిగిరి, అలాజిపూర్ కిషన్, దాసరాజురామారావు, వఝల శివకుమార్, నాళేశ్వరం శంకరం, కందుకూరి శ్రీరాములు, రామగిరి శివకుమార్ శర్మ, అన్నవరం దేవేందర్ ఈ ధోరణిలో రాస్తున్నరు.

సిరిసిల్లనుండి బొంబాయికి చేనేత కార్మికులెంతో మంది బత్కవోతరు. పాలమూరు లేబరయితే కడుపు చేతబట్టుకోని దేశం గాని దేశం బోతరు. కింది కులాల వాళ్లు చాల మంది ఉప్పరపనికో, కూలికో బత్కేతందుకు పట్నాలకు వలసపోతరు.

*ఊళ్ళకూల్లు ఎన్ని కూలిపోతె*
*వయసులోని పట్టణాలు చేతికర్ర ఆసరాతోని నిలబడతయి*

అనంత వేదనకు శంకుస్థాపన చేసి బస్సు 'హాల్' అవుతది
'ఓ కొడుకా' అనే ఏడుపు ఎంత తన్నుకొచ్చి
లీలగా చప్పుడులో కలిసిపోతుంది

దయాదాక్షిణ్యాలులేని బస్సు కంటికీ మంటికీ ఏడుధారలుగా కదలిపోతుంది. జగన్నాథం కవిత కన్నీళ్లు తెప్పిస్తది. అల్‌కబీర్ కోతకు వెళ్తున్న పశువుల మీద కిషన్ రాసిన 'గోస' హృదయాన్ని పిండివేస్తది.

మీరు నరకాన పడొద్దని దానమిచ్చిన్నాడు
అంబా అంటున్న ల్యాగనిడిసి నరకాన పడ్డదాన్ని
అడ్వీల పులి ఆకలైతే ఒక్కసారే సంప్కతింటది
కబేలల గొట్టి మిషిన్ల నెట్టి, మెడగోసి, కాలునర్కి బర్ఫ్ డబ్బాల్ల వెట్టి అమ్ముతరు

తెలంగాణ ఊళ్లల్ల కొల్పులోళ్ల బతుకు దుర్భరం, ఆడోళ్లను దేవతలకో, కులపెద్దకో పెండ్లిజేస్తరు. వాళ్లు పీనుగల ముందు ఆడాలె. ఎగురాలె. తిండికి ఎప్పుడూ తిప్పలే. సమాజంలో ఏనాడూ గౌరవం దొరికే పరిస్థితి లేదు.

ఈడొచ్చీ రాకముందే తొల్త బుట్టిందాన్ని ఊరుమీది కిడ్వాలే
అది ఏడేడు పట్నాల్ దొక్కి ఆడనేర్వాలె
మా పోరగాండ్ల ఉసురు వోస్కోవడ్తిమి
అది కొంగెయ్యని జాగనే ఉండది బాంచెన్
లగ్గాలొచ్చినా సావులొచ్చినా ఆళ్ళముంగటాడాలె
ఆళ్ళపీన్గల ముంగటాడాలె
మా పోరగాండ్లు ప్యాలాలేరుకుంటరు. పైసలేరుకుంటరు

యువకులు కష్టాలు, కన్నీళ్లు భరించలేక తిరగబడుడు సహజం. ధిక్కరించేటోళ్ల సోపతి పట్టి అడవి దిక్కుపోతంటే తల్లిదండ్రుల శోకం ఒక పట్టాన ఆగది. ఆ బాధ తీర్చెతందుకు ఎవలి శక్తీ చాలది. గుట్టకుపుట్టకు ఎదురైనోల్లకల్ల చెప్పుకోనీ ఏడుస్తుంటరు.

మావోడు పురాగ అడివైపోతండు
అజాత్ అయిపోతండు
జెర బుద్ధిచెప్పుండ్రి బాంచెన్, గులాపోన్ని
ఉన్నోడే ఒక్కడు - గంజిల మెతుకోలె
గిట్ల జేస్తె మేమేమైపోవాలె



నాళేశ్వరం శంకరం చెరుకు రైతుల దయనీయ స్థితిని చిత్రిస్తూ మంచి కవిత రాసిండు. గిట్టుబాటవుతుందని చెరుకో, పత్తో వేస్తే మార్కెట్ దగ్గర అంతా దళారీలే. పైరవికార్ల చేతుల్లో బతుకు. రామగిరి శివకుమార శర్మ నీటి కొరత, కరెంటు కోతల్లో రైతుల యాతన ఆర్ద్రంగా చిత్రించినాడు.

పెద్దపెద్ద కట్టలు బోసిచెరువులు గట్టి తలుపులు బెట్టి
పెద్ద మోటర్లతోని నీళ్లను మీదిక్కు ఉరికిచ్చుకుంటిరి
కరెంటుకోసం మిగిలిన నీళ్లనాపుకుంటిరి
రెప్పగొట్టకుంట మీ యిండ్లల్ల కరెంటెప్పుడు ఎల్గాలెనాయె
మాయి యెట్లైనా చిమ్మన చీకటి బతుకులేనాయె
పావుగంట టీవీల కరెంటు బందయితె లొల్లుల్ జేస్తరు
పొట్టకొచ్చే కాలానికి రోజులకురోజులు కరెంటి బందైతే
ఎంతలొల్లివెట్టినా ఇచ్చెటోల్లేవలు

కరెంటు కోత ఎత్తివెయ్యాలని రైతులు రోడ్లమీద బైఠాయిస్తరు. నీళ్ళు కావాలని బైఠాయిస్తరు. ఎరువులు కావాలని రాస్తారోకో చేస్తరు. దర్భశయనం శ్రీనివాసాచార్య రైతుల ధర్నాను కవిత్వీకరించిండు. తెలంగాణల ఏది ఎవలకు దక్కాలన్నా కష్టమే. ఎవలది వాళ్లకు దక్కాలంటే మరింత కష్టం.

ధాన్యంతో అంగడి ఆటాడుతుంది.
ఊరు ఓడిపోతుంది
చేసంచి పట్టుకొని రేషన్ దుకాణం ముందు నిలబడ్తుంది
పండించిన చేతుల్లో ఏమీ మిగలవు పగుళ్లు తప్ప -

పూర్తి మాండలిక భాషనుపయోగించి కవిత్వం రాయడం అందరికి సాధ్యం కాదు. అచ్చం మాండలికాన్ని ప్రయోగిస్తూ వృత్తి కులాల భాషను కవిత్వీకరించిన గోసంగి కవులది ప్రత్యేకమైన శైలి. వేముల ఎల్లయ్య, అంబటి వెంకన్న, ప్రసాద్‌ల కవితలు బాగా ఆకట్టుకుంటున్నయి.

1996 నుండి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం తిరిగి రంగం మీదికి వొచ్చిన తర్వాత ఆంధ్రా వలస పెత్తందార్లకు వ్యతిరేకంగా కవిత్వం వొస్తున్నది. వనరులను దోచుకపోతున్న వైనాన్ని గుర్తించి ప్రశ్నిస్తున్నరు. భూమి సమస్యతో పాటు నీటి సమస్య చర్చనీయాంశమైంది. బోధనం నర్సిరెడ్డి, పగడాల నాగేందర్ కవితలు అట్లా వచ్చినవే.

*కాలం పొడుగూత తెలంగాణల బువ్వ కోసం లొల్లి*
*భూమికోసం లొల్లి లొల్లికేతల్లి అయిన తెలంగాణ మొదలు పెట్టిన లొల్లి*
*కండ్ల ముంగల గంగమ్మ పోతంటే*
*పాతాల గంగమ్మను బొక్కనేసి చేదుకొనే చోద్యం మాది*

చెరుకు సుధాకర్ రాసిన కవిత తెలంగాణ పరాధీన స్థితిని ఆవిష్కరించింది. అనిశెట్టి రజిత తెలంగాణ హృదయంతో కవిత్వం పంచింది. మంజీరా రచయితల ప్రత్యేక తెలంగాణ పాటల సంకలనం 'తెలంగానం' ప్రాచుర్యం పొందింది.

జూలూరు గౌరీశంకర్ 'నా తెలంగాణ' ప్రత్యేకరాష్ట్ర చైతన్యంతో వొచ్చిన మొదటి కావ్యం. సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'దాలి', శిరసు కవులు 'నల్లవలస' కావ్యాలు ప్రచురించినారు.

*వచ్చినవాడు వ్యాపారమయుడు*
*ఆంధ్రప్రస్థ నిర్మాణంలో*
*విశ్వకర్మ మాయగాడు*
*హుసేన్‌సాగర్ దరిదాపులో*
*విగ్రహాలన్నీ మీవి శవాలన్నీమావి!*

ఈ మధ్య 'సిమాంట' (నూతన సాహితి హుస్నాబాద్), సుక్కపొడుపు (సాహితీ సమితి, వరంగల్), ఎడపాయలు (మంజీరా రచయితల సంఘం, మెదక్), కవితా సంకలనాలను తెలంగాణ తెలుగులో ప్రచురించినారు. ఇంకా సమగ్రమైన తెలంగాణ కవితా సంకలనం రావాల్సి ఉంది.

ఇట్లా ప్రాంతాల నుంచి, ప్రాంతీయాభిమానంతో, కొత్త కోణంలో కవితలు వొస్తున్నప్పటికీ రావాల్సినంత విరివిగ రావడం లేదు. ఒక ఉద్యమానికవసరమైన స్థాయిలో ఉత్తేజపర్చవలసి ఉన్నది. అనేక కారణాల వల్ల ఆగిపోయిన కవులు తిరిగి కలాలు ఝుళిపించడం ఈనాటి అవసరం. ఆయా జిల్లాల్లోని సాహిత్య వాతావరణం స్తబ్దంగా ఉండిపోవటానికి కారణాలు విశ్లేషించుకుని ఈ చారిత్రక సందర్భానికి తగిన విధంగా సాహిత్య సంస్థలు పనిచేయవలసి ఉన్నది. తెలంగాణ ప్రజల ఆకాంక్షల మేరకు వాళ్ల జీవనానుభవాల్ని ప్రతిభావంతంగ ఆవిష్కరించెందుకు కవులంతా గొంతెత్త వలసి ఉన్నది.

*- నేటినిజం, ఉగాది ప్రత్యేక సంచిక ఏప్రిల్ 2002*
*- ముద్దెర, ప్రాంతీయ సాహిత్యవ్యాసాలు అక్టోబర్ 2005*



# తెలంగాణ భాష - కవిత్వం

**క**విత్వంలోకి సామాన్యుడిని తీసుకరాగలిగినంగానీ సామాన్యుడి భాషను మాత్రం తేలేక పోతున్నం. భాషకు సంబంధించి చాలా వివాదాలు చర్చించవలసినవీ, పరిష్కరించుకోవలసినవీ ఇంకా మిగిలే ఉన్నయి. ఇయ్యాల భాషా వివాదాలు లేనేలెవ్వని ఎంత గంభీరంగ ప్రకటించుకుంటున్నప్పటికీ వాటిని అధికార స్వరంతో, అణిచివేత స్వభావంతో అంటున్న మాటలు గానే అర్థం చేసుకోవలసి వొస్తంది. దళితకులాల భాషలోనో, మాండలిక భాషలోనో, ప్రాంతీయ భాషలోనో ఒక కవిత వస్తే సహించలేకపోవడం తెలుగు సాహిత్యంలోనూ జరుగుతంది. సాధారణభాషను నిరోధించెటందుకు కావ్యభాషను అడ్డుపెట్టిన వారు కొందరైతే కావ్య భాషావాదం వాడి తగ్గిపోయినందువల్ల మరి కొందరు ప్రామాణికభాషను ఎదురునిల్పి సఫలీకృతులౌతున్నరు. ఎవరి మాండలికాలు వారు రాసుకుంటూపోతే ఏదీ ఎవరికీ అర్థంకాదనీ, అన్ని ప్రాంతాల వారికి తెలిసే అనుసంధాన రూపం అదే ప్రామాణిక రూపం ఉండాలని వాదిస్తున్నరు. అన్నింటికన్న ఆశ్చర్యమేమంటే గ్రాంధికభాషకు వ్యతిరేకంగా వాడుక భాషకోసం వాదించి, సాధించిన ప్రగతిశీల భాషా వేత్తలే ఇయ్యాల్ల మళ్లా ప్రాంతీయ భాషలను, మాండలిక భాషలను వ్యతిరేకించేటందుకు గ్రంథాల, పత్రికల భాషను ప్రమాణంగా ముందు పెడుతున్నరు.

తెలుగు అకాడమీ బోధనా గ్రంథాలను ప్రచురించటం మొదలు పెట్టిన తర్వాత మాండలిక భాషల అణిచివేత తీవ్రతరమైంది. పత్రికలు - సినిమాల ప్రభావం వల్ల అంతకు ముందే ఇక్కడి విద్యార్థుల్లో యువకుల్లో తమ భాషపట్ల మానసికంగా వ్యతిరేకత పెరిగింది. విశ్వవిద్యాలయాలు ఉమ్మడిగా ప్రవేశపెట్టిన కామన్ కోర్‌సిలబస్ పబ్లిషర్ల మార్కెట్ పెంచటానికి ఎంతగా పనికొచ్చిందో విద్యార్థుల మాతృభాషా మాండలికాలను అంతకంటె ఎక్కువగా అణిచివేసింది. అన్నిరకాల మీడియా యంత్రాంగం చలవవల్ల యువకులు భాషా పరాయీకరణకు లోనుగావటమేగాక ఉగ్గుపాలతో నేర్చుకొన్న భాషపట్ల, పదాలపట్ల,

ప్రయోగాలపట్ల అత్యంత చులకన భావం ఏర్పరచుకున్నరు. ఇట్లాంటి దశలో అసలే సాంస్కృతిక ఉన్నతరూపమైన సాహిత్యంలోనికి కవిత్వం లోనికి ప్రాంతీయభాష ప్రవేశించటం దుస్సాహసంగనే ఉంటున్నది. ఎన్నో రకాలుగా అణిచివేయబడుకుంట వచ్చిన తెలంగాణ భాషను తెలుగు కవిత్వం సమాదరించలేక ఉద్దేశ్యపూర్వకంగానే పక్కకు పెడుతూవస్తున్నది తెలంగాణభాష మర్యాదస్తంగ ఉండదనీ, అందరికీ అర్థంగాదనీ సౌందర్యం లేదనీ, అన్యదేశ్యాలు ఉర్దూపదాలు పంటికింది రాళ్లలాగా కరుకుగా ఉంటయనీ కొందరు బహిరంగంగనో చాటుగానో మాట్లాడటం తరచుగ జరుగుతున్నది తెలుగు రాష్ట్రంలో తెలంగాణీయులు రెండవజాతి పౌరులుగ చూడబడుతున్నట్టే తెలుగు కవిత్వంలో తెలంగాణ భాషరాసే కవులు రెండవ శ్రేణి కవులుగా పరిగణించబడుతున్నరు. తెలంగాణ భాష గురించి, కవిత్వం గురించి మాట్లాడిన ప్రతీసారి సహృదయులకు కోపగింపుగా ఉండటం విచారించదగింది.

ఎవరి మాతృభాషలో వారు తమ అనుభవాల్ని, ఆరాటాల్ని వ్యక్తం చేసినంతగ మరోభాషలో వ్యక్తం చెయ్యలేరని భాషా శాస్త్రవేత్తలు నిరూపించి ఉన్నరు. రాయలసీమ జీవితం లోతులు చిత్రించటానికి రాయలసీమ భాషలో తప్ప మరొకరకంగా సాధ్యంకాదు. ఉత్తరాంధ్ర ప్రజల పరిస్థితికి అక్కడి మాండలికాలు అంతే అవసరం. తెలంగాణ ప్రజల ఆత్మావిష్కారానికి, తొక్కులాట చెప్పేతందుకు తెలంగాణ భాష తప్ప మరేదీ పనికిరాదు. అయినప్పటికీ తెలంగాణ కథల్లో, నవలల్లో, నాటకాల్లో పాత్రోచిత భాష రాయటానికి మాత్రమే అంగీకరించిన ప్రగతిశీల, ప్రజాస్వామిక వాదులు కథానిర్వహణ (Narration) స్థానంలోకి తెలంగాణ భాష రాకుండా కట్టడి చేయగలిగింద్రు.

తెలంగాణ భాషలో కవిత్వం సృజించటానికి ప్రయత్నాలు జరుగుతున్నప్పటికీ అవన్నీ ఇంతవరకు సగం సగం ప్రయత్నాలుగనే ఉండిపోయినయి. నిజాం వ్యతిరేక పోరాటం జరుగుతున్న రోజుల్లో తెలంగాణ భాషలో అనేక కళారూపాలువచ్చినయి. ముఖ్యంగ పాటలు అసంఖ్యాకంగనే వచ్చినయి. "బండెనుక బండి గట్టి పదహారు బండ్లు గట్టి ఏ బండ్లెవొతవు కొడుకో నైజాము సర్కరోడ నాజీల మించినవురో..." "ఏటికేతంబట్టి ఎయిపుట్లు పండించి ఎన్నడూ మెతుకెరుగరన్న" "పసుల గాసే పిల్లగాడా, పాలబుగ్గల జీతగాడ పాలు మరిసీ ఎన్నాళ్లయ్యిందో..." యాదగిరి, సుద్దాల హన్మంతు మొదలు చదువొచ్చీరానికవులు ఎందరో వాళ్ల భాషలో పాటలు గట్టి ప్రజలను చైతన్యం జేసి ఉద్యమం నడిపింది ఒక వాస్తవమైతే, ఆ పాటలను తెలుగుసాహిత్య చరిత్రలో భాగంకాకుంట జాగ్రత్త పడ్డది ఇంకో వాస్తవం. పాటను



కవిత్వం నుంచి విడదీయడం, పాటను కనీసం విడిప్రక్రియగానైనా గుర్తించకపోవటం రెండూ తెలివిగానే జరిగిపోతున్నయి.

వచన కవిత్వానికి సంబంధించి 1970ల నుంచి తెలంగాణ భాషలో కవిత్వం రాసే ప్రయత్నాలు కొనసాగుతున్నయి. 1967-68ల్లోని విప్లవోద్యమాలు జాతుల అవగాహనలను, భాషాచైతన్యాన్ని కలిగించినయి. ఉద్దానంగిరిజనయాసల్లోకథలు వచ్చినయి. విశాఖ మాండలికంలో నవలా సాహిత్యం వచ్చింది. అప్పుడే విశాఖ మాండలికాలలో వచన కవిత్వం, పాటలు వచ్చినవి. 1969ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉధృతిపొంది తెలంగాణ భాషాస్పృహ పెరిగింది. దాశరథి రంగాచార్య తెలంగాణ భాషలో కథలు, నవలలు రాసినాడు. 1970 ల్లో టి. కృష్ణమూర్తి యాదవ్ "తొక్కుడు బండ" దేవరాజు మహారాజు "ఊల్లెకుగాదొచ్చింది ఉర్కిరాంఢ్రి ఉర్కిరాంఢ్రి" పంచరెడ్డి లక్ష్మణ "ఇసిత్రం" భాను "ఊరోల్లు" మాండలిక కవితలు వెలువడినయి. ఈ కవితలకు సభల్లో విశేషాదరణ లభించినప్పటికీ, ఇక్కడి ప్రజలు తమ భాషారచనను గుండెలను హత్తుకున్నప్పటికీ వలసపెత్తందార్ల పెట్టుబడి దార్ల పత్రికలు, సాహిత్యకారులు వాటికి మాండలిక ముద్ర వేసి చిన్నచూపు చూసినారు.

1972-73లో వొచ్చిన 'జీవనాడి' పత్రిక తెలంగాణ భాషకు జీవం పోసింది. ప్రజా చైతన్యం కొరకు, ఉద్యమ ప్రచారం కొరకే అయినా తెలంగాణ ప్రజల భాషలో కథలు కవితలు పాటలు ప్రచురించింది. 'సృజన' పత్రిక, విరసం ప్రాంతీయభాషలలో రచనలను ప్రోత్సహించాయి. వెల్లువెత్తిన ప్రజా ఉద్యమాలు, విద్యార్థి ఉద్యమాలు, ప్రగతిశీల పత్రికలు, బులెటిన్‌లు భాషకు సంబంధించి ప్రజాస్వామిక దృష్టిని కలిగి ఉండి శ్రీకాకుళం మాండలికాలకు, తెలంగాణ భాషకు సాహిత్య గౌరవాన్ని చేకూర్చినయి. ఉద్యమాలు కలిగించిన ధైర్యంతో తెలంగాణ భాషలో కవితాసంపుటులు వెలువరించటానికి, రచయితలు సాహసించినారు. 1973లో పంచరెడ్డి లక్ష్మణ "ఇసిత్రం" 1974లో దేవరాజు మహారాజు "గుడిసె-గుండె" రెండు సంపుటాలు పూర్తిగా తెలంగాణ యాసతో, భాషలో వెలువడి కొత్త ఒరవడిని సృష్టించాయి.

అయితే ఆ రచనల్ని ఆధిపత్య సాహిత్య భావన తక్కువ స్థాయి రచనలుగా భావించి వాటి పట్ల నిర్లక్ష్యం ప్రదర్శించటం వల్ల తర్వాత రావాల్సిన ఎన్నో ప్రాంతీయ, మాండలిక భాషా సంపుటులు నిలిచిపోయినయి. 1974-76మధ్య చాలామంది తెలంగాణ రచయితలు తమభాషలో కవితలు రాసినప్పటికీ వాటిని సంపుటిగానో సంకలనంగానో తేలేక పోవటం తెలంగాణ సాహిత్య చరిత్రకు విషాదమే. జీవనాడిలో రాస్తూవచ్చిన 'భాను' కవితాసంపుటి

"ఊరోల్లు" 1983 కి గానీ రాలేదు. అట్లానే 1970ల నుంచి రాస్తూ వచ్చిన టి.కృష్ణమూర్తి యాదవ్ సంపుటి "తొక్కుడు బండ" మరో అయిదేళ్లకు 1988 లో వచ్చింది. 1976లోనే కవితా సంపుటికి తెలంగాణ పూలపేరు 'తంగెడుపూలు' పెట్టి వెలువరించిన ఎన్. గోపి అదేసంవత్సరం "పల్లెల్లో మనపల్లెల్లో" శీర్షిక కింద మూడుకవితలు తెలంగాణ భాషలో రాసినాడు. ఆ ధోరణిలోనే మరిన్ని కవితలతో తెలంగాణ భాషలో కవితా సంపుటి వెలువరించాలన్న ఆయన ఆకాంక్ష రూపుదిద్దుకోలేదు. 1982లో వెలువడిన 'మైలురాయి' లో అవి అంతర్భాగం కావలసివచ్చింది. 1972ల నుంచి గద్దర్, భూపాల్, చెరబండరాజులు తెలంగాణ భాషలో ఎన్నో పాటలురాసి ప్రజలను ఉర్రూతలూగించినప్పటికీ సాహిత్య చరిత్రలో వాటిని అంతదూరంలోనే ఉంచటం యాదృచ్ఛికంగా జరిగిందేమీకాదు.

1980ల నాటికి తెలంగాణ భాషపట్ల తెలుగు సాహిత్య ప్రముఖులు నిరాసక్త, నిర్లక్ష్యవైఖరి అవలంబించినట్లు స్పష్టంగా కొట్టొచ్చినట్టు ప్రకటితమైంది. ఎప్పుడు తెలంగాణ భాషలో రచనలు వచ్చినా విమర్శకులు ఏదో ఒక సాకును అడ్డుపెడుతూ వచ్చినారు. దేవరాజు మహారాజు, పడాల రాములు ఆసాంతం తెలంగాణ భాషలో కథలు రాసినారు. విప్లవోద్యమాల ఉధృతి పెరిగి అల్లం రాజయ్య తెలంగాణ కథలు (Narration) కథనంతో సహా తెలంగాణ భాషలో కరీంనగర్, ఆదిలాబాద్ మాండలికంలో రాసినాడు.

'ఎదురుతిరిగితే' 'కొలిమంటుకున్నది' మొ॥న రచనలను సృజన సాహసంగా ప్రచురించినప్పుడు మాండలిక భాషల మీద సుదీర్ఘచర్చ జరిగింది. ప్రగతిశీల సాహిత్యకారులు కూడా చాలా తెలివిగా తెలంగాణ భాషను వ్యతిరేకించడం గమనించవచ్చు. చర్చల తర్వాత రాజయ్యకూడా పాత్రల సంభాషణలకే తెలంగాణ భాషను పరిమితం చేసి మిగతా కథనమంతా ప్రామాణికంగా పిలవబడుతున్న భాషలో రాస్తూ వచ్చినాడు.

తెలంగాణ భాషలో రాయ సాహసించక, ప్రామాణికభాషలో కుస్తీలు పడుతున్న తెలంగాణ కవులు తర్వాత జరిగిన ఆలోచనల ప్రేరణతో, చర్చల ప్రభావంతో కవిత్వంలో కూడా మధ్యేమార్గాన్ని ఎంచుకున్నట్లు కనిపిస్తుంది, కవిత్వంలో తరచుగా తెలంగాణ భాషానుడికారాలు, పలుకుబడులు, పదప్రయోగాలువాడుకుంట కొత్త శైలి సాధించినారు. పాత్ర స్వభావాన్నో పరివేదననో చెప్పవలసి వచ్చినప్పుడు తెలంగాణ భాషలో వ్యక్తీకరిస్తూ, కవి అనుభవంగా చెప్పదలచుకున్నప్పుడు ప్రాంతీయ పదాలు, నుడికారాలు, ప్రయోగాలు చేస్తున్నరు. అల్లం నారాయణ, సిధారెడ్డి, జూకంటి జగన్నాథం ఇట్లా సాధన చేసి ప్రత్యేక వరవడిని తీసుకొచ్చింద్రు. భాష న్యూనత నుంచి బయటపడేటందుకు ఈ శైలి ఆధారంగా



తెలంగాణతనాన్ని కాపాడుకుంట వచ్చినారు. తమ సంపుటాలకు తెలంగాణ అస్తిత్వాన్ని తెలిపే శీర్షికలు పెట్టుకోవడం లాంటి మార్పులు తీసుకొచ్చినారు. జూకంటి జగన్నాథం "పాతాళగరిగె" "గంగడోలు" వఝల శివకుమార్ "గోగుపువ్వు" పప్పులరాజిరెడ్డి "వరదగూడు" జింబో "హాజిర్‌హై" మంజీరా కవుల "మొగులైంది" పాలమూరు కవుల "దేవులాట" ఇవన్నీ కొత్త స్పృహకు నిదర్శకాలే. దేవరాజు మహారాజు "బైరూపులోల్లం" సిధారెడ్డి "మాకున్నవి రెండుసేతులే" "మాకెవరు నేర్పింద్రు తండ్రీ" మోతుకూరి అశోక్‌కుమార్ "కొల్పులోల్లం" తెలంగాణ భాషలో పదునైన వ్యక్తీకరణలుగా గుర్తింపు పొందినయి. ఇటీవలి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం (1996-97) పుంజుకుంటున్న దశలో కొన్ని మాండలిక కవితలు వచ్చినయి. అనిశెట్టి రజిత "జంగ్‌షురూ" "జరలేచిపోంద్రి" చెరుకుసుధాకర్ "మల్ల మొదలయింది లొల్లి" కవితలు తెలంగాణ భాషలో వెలువడ్డ కవితలు. ఇవి కరపత్రాల రూపంలో వచ్చి చాలా మందికి చేరినయి.

దళిత ఉద్యమ చైతన్యాలు తెలుగు సాహిత్యంలో చాలామార్పులు తీసుకొచ్చినట్లే భాషలో గూడా నూత్న ప్రయోగాలు చేసి మార్పుతెచ్చినయి. ఇటీవల నల్లగొండజిల్లా నుంచి దళిత కవులు పూర్తి తెలంగాణ భాషలో కవిత్వం రాస్తున్నరు. ఇది కొంతసాహసికమే అయినా ఆహ్వానించదగిన మంచి పరిణామం. వేముల ఎల్లయ్య, వెంకట్‌లు "మేమే" "మొగి" పేర్లతో రెండుకవితా సంపుటాలు వెలువరించి తెలంగాణ యాసను, భాషను కుదార్తంగ వాడుకున్నరు.

తెలుగు సాహిత్యం ఎంత గుర్తించ నిరాకరించినా ప్రజల భాష ఏదో ఒక రూపంలో సాహిత్యంలోనికి రాక తప్పదు. ఏ ప్రాంత ప్రజల జీవన పరిస్థితులనైనా ఆ ప్రాంతం భాష తప్ప మరోటి ప్రతిభావంతంగా పదునుగా ఆవిష్కరించలేదు. 1970లోకృష్ణమూర్తి చిత్రించిన దళిత జీవిత వేదన ఆ భాషలో మాత్రమే బలంగా వ్యక్తమైంది.

కట్టం సెయ్యక అడిగిన్నా సేసడిగిన్నా
తాడిస్తి తలుగిస్తి తొండమిస్తి దోర్నమిస్తి
చాటొదల పోతిరి మూటొదలక పోతిరి
నూక్కున్న గింజ ఏరుకున్న పరిగె గుంజుకుంటిరి
ఎట్లబతుకాలె బాంచెన్
ఊర్లెమీరే అడవిల మీరే

పనిచేసి కూలిగిట్టని ఎల్లి దొరచేత దెబ్బలు పడిన వేదనను కవి చిత్రించిండు. లంబాడీలు సంచార జాతులయినా అక్కడక్కడ చిన్న చిన్న గుంపులుగా స్థిరపడ్డరు. ఆ చిన్న గుంపును తెలంగాణలో 'తండా' అంటరు. తండలు తాము జీవించేటందుకు కట్టెల మోపులు బస్తీలో అమ్ముకుంటరు.

*తడికల పుడినుండి బేతంపుడి దాక తండలు*
*తండలకు తండలు అంగట్ల కలుస్తరు*
*కొత్త గూడెం అంగట్ల కట్టెలమ్ముకొని*
*పూలు కొనుక్కోరు*
*పాత చింతపండు పావెడు మంచినూనె కొనుక్కుంటరు*
*రైలు ఎంతో దూరం బోతదిగని*
*ఆళ్ళు తండలు దాటిపోరు.*

కృష్ణమూర్తి తెలంగాణ భాషను బలంగా సహజంగా వాడుకొని కవిత్వం చేసినాడు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని మూడు ప్రాంతాల్లో తెలంగాణ ప్రాంతంలో అక్షరాస్యత బాగా తక్కువ. ఆదిలాబాద్ జిల్లాలో మరీ తక్కువ. నిజాం పాలన నుంచి ఇప్పటి పాలకుల నిర్లక్ష్యం దాంక అనేకాంశాలు ఇందుకు కారణాలుగ ఉన్నయి. విద్యాపథకాలు స్వీకరించే స్థితిలో సుత ఇక్కడి ప్రజల జీవనప్రమాణం లేదు. ఎన్.గోపి "పల్లెల్లో మనపల్లెల్లో" శీర్షికలోని ఒక కవిత ఆ స్థితికి అద్దం పట్టింది.

*సదువెందుకు తండ్రీ*
*ఏమొస్తుంది మాకు*
*బువ్వొస్తదా జొన్న లొస్తయా*
*తెలివా - తెలివేం జేసుకోను నాయనా*
*మూడ్రోజులాయె కూడులేక బాంచెన్*
*దేవదారు గడ్డిదెచ్చి బండరొట్టెలు జేసుక తింటున్నం*

ప్రజలు చాల కష్టజీవితం వెళ్లదీస్తుంటరు. తిండితిన్నా తినకపోయినా తిట్లుమాత్రం తినొద్దనేటంత నిజాయితీ ఉన్నవాళ్లు. ఏరంగుల ఏముంటదో ఎరుకలేనోల్లు 'ఏ రంగూ లేనోళ్ళు' ప్రపంచం ఎంత మారుతున్నా వీళ్ల బత్కుమారదు. వొచ్చే సౌకర్యాలు వాళ్లను



దృష్టిలో పెట్టుకోవు. వాళ్లకు అందుబాటులో ఉండవు. 'బయిరూపులోల్ల' అవస్థను వ్యక్తీకరించేందుకు దేవరాజు మహారాజు ఆభాషనే ఎన్నుకున్నడు.

*సూస్తసూస్త మోటర్లొచ్చె గాలిమోటర్లొచ్చె*
*మాకండ్లల్ల గింత దుబ్బ, ఇశికె, బొగ్గు దప్ప*
*ఎక్కింది లేదు పెట్టింది లేదు*
*బువ్వకుండల మెత్కుల్లెక్క దేశమంత ఉడుక్తనే ఉంటిమి*

బాధలు భరించలేనోల్లు తిరుగుబాట్లుచేస్తారు. తిరగబడితె రాజ్యం ఊరుకోదు. తెలంగాణలో అట్లా పోరాటాలు చాలా లేసినయి. వెంటనే భయంకర నిర్బంధం సాగింది. తల్లి ప్రేమతో పెంచుకున్న చెట్టంత కొడుకును రాజ్యం మాయం చేసినపుడు ఆమె తల్లడిల్లింది. ముసలితల్లి వేదన అల్లంనారాయణ ఆ భాష ఆధారంగానే వ్యక్తీకరించిండు.

*తొలిసూరి కొడుకువనుకున్న గాదుర రాజన్న*
*ముందుగాటి ముద్ద వెట్టి సాదుకున్న గాదుర కొడుక*
*ఎవల్ని బిలిసి అన్నం బెడ్దురా కొడుక*
*సిన్నసిన్న తమ్ములకు బుద్దులు గ్యానం జెప్పితివి గాదురకొడుక*

కొడుక్కోసం తల్లి పలవరించిన తీరులోనే కవిత నిండుతనం పొందింది. రెండో తరహా భాషా ప్రయోగంతో తెలంగాణ కవులు పదునైన శైలిని సాధించినారు. తెలంగాణ భాషను ప్రామాణిక భాషారీతిని మేళవించిన కొత్తదనంతో చాలా రచనలువచ్చినయి. డిక్షన్‌లో తెలంగాణ అస్తిత్వాన్ని నిలుపుకుంటూ, కాపాడుకుంటూ, కవితాశైలిలో తెలంగాణ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించి కవులు నూత్న రీతిలో స్థిరపరచినారు. ఎన్.గోపి, జగన్నాథం, సిధారెడ్డి, పర్ల గోపాల్, నారాయణ, శివకుమార్, నాగభూషణం, రాజిరెడ్డి చాలామంది ఈ తరహాలో కవిత్వం రాసింద్రు.

చేపిన ఆవు పొదుగు ముందునుండి గుంజుకొచ్చి గుంజకు కట్టేసినప్పటి లేగదూడ చూపుల గోసను వెల్లడించడానికి జూకంటి జగన్నాథం 'పాతాళ గరిగె' 'గంగడోలు' సంపుటాల్లో ఇట్లాంటి పద్ధతిననుసరించినాడు. తెలంగాణ కవులందర్నీ, కవితలన్నింటినీ ప్రస్తావించటం ఇక్కడ సాధ్యంకాదు గానీ ప్రాతినిధ్యాన్ని, భాషలో రచనాక్రమాన్నీ పేర్కొన్నాను. భాషపట్ల మనలో చాలామందికి ప్రజాస్వామికి దృష్టి కొరవడుతున్నది. మాండలికాలు, ప్రాంతీయ

భాషల అణచివేతలు సాహిత్యవికాసానికి మంచివికాదు. ఆ జాతి ప్రజల సృజనాత్మకత దెబ్బతింటుంది. న్యూనత, ఈసడింపు, ఎగతాళి లాంటి పనులు సంస్కారులు చేయదగినవికావు. ఇప్పటికీ సినిమాల్లో పత్రికల్లో తెలంగాణ భాషను నిరాదరించటాన్నీ హాస్యానికే ఉపయోగించటాన్ని తెలంగాణీయులు తీవ్రంగా నిరసించవలసి వుంది.

భాష అసమానస్థితిని కూడా దేవరాజుమహారాజు తెలంగాణ భాష లోనే చెప్పిండు.

*నల్లపైపుల కేల్లి దారపడ్డట్టు*
*మీరు మంచిగ పొంకంగ సన్నసన్నగ మాట్లాడ్తరు నాయ్నా*
*మాదేంది ఒర్రె దాటు బగ్గడేషం*
*మానోటి మాట బతుకంత పొరుకుంటొస్తది*
*మాయి శానిమాటలు గావు - మోటుమాటలు - కనిజాటమాటలు కావు*

ఏ భాషలోనైనా సంస్కృతిలోనైనా నిరసించవలసిన లక్షణమేదో, గుండెకు హత్తుకోవల్సిన లక్షణమేదో అందరూ ఆలోచించవలసి ఉన్నది. భాష విషయంలో మాండలిక, ప్రాంతీయాల విషయంలో సుదీర్ఘమైన, స్పష్టమైన చర్చ జరగాల్సిన అవసరమెంతో ఉంది. ఆలోచనాపరులు సాహిత్య కర్తలు ఏ ప్రాంతం వారైనా అణచివేతకు గురవుతున్న రచయితలు, కవులు అందుకు సిద్ధపడి ముందుకు రావాలె. రచన బాగా రాణించటానికి ప్రజల జీవద్భాషలో ఉండే శక్తి మూలస్థానం పొందాలని బలంగా వాదించాలె. అనుభవం అనుభూతి ప్రాణభరితంగా ఆవిష్కరించేటందుకు, కవిత్వాభివ్యక్తి పరిణతి రూపం పొందేటందుకు ఆకవి మాతృభాష ఆభాష ప్రాంతీయత, మాండలికాలే ముఖ్య ఆధారాలు అయితాయని నిరూపించాలె.

*- చూపు, తెలంగాణ ప్రత్యేక సంచిక*
*- నవంబర్ - డిసెంబర్ 2001*



# ముంపుకు గురయితున్నది తెలంగాణ భాష

**కొం**తకాలంగా తెలంగాణసమస్యల మీద అక్కడక్కడ ఏర్పాటు చేసిన సభలకు పోయినప్పుడు తెలంగాణ భాషల మాట్లాడుమని ఒత్తిడి వస్తున్నది. ప్రసంగాల్లో తప్పిదారి ఒకటిరెండు మాటలో పలుకుబడులో ఒలికినప్పుడు సభికుల్లో మంచి స్పందన కన్పిస్తంది. సభికులు కోరుకుంటున్నప్పటికీ వక్తలకు మాట్లాడాలని ఉన్నప్పటికీ తెలంగాణ భాష మాట్లాడలేకపోతున్నరు. ఏదన్న రాయాలన్నా తెలంగాణ భాషలో రాయలేకపోతున్నం. తెలంగాణ మిత్రునికి ఉత్తరం రాయాలనుకొన్నా ఆభాష వాడం. మనకేకాదు తెలంగాణ విద్యాధికులైన వాళ్లందరి పరిస్థితి ఇదే. ఈ భాష మాట్లాడలేని,రాయలేని పరిస్థితి నెలకొని ఉన్నది. అసలు విద్యావంతుడు అనిపించుకునేతందుకు గుర్తు పరభాష మాట్లాడటమనే అపోహ వున్నది. చదువుకున్న నేరానికి సమాజం నేర్పిన భాషను క్రమంగా వొదులు కోకతప్పుత లేదు. స్థాయిమారిన కొద్దీ రక్తంలో కలిసిన భాషను బల్మీటికి చంపుకోవలసిన దుస్థితి దాపురించింది.

తెలంగాణ భాష ఇయ్యాల్ల జీవభాషగా లేదా? పల్లెల్ల బస్తీల్ల పనులు చేసుకొని బతికే కోట్లమంది సామాన్య ప్రజలు తెలంగాణ భాషలోనే వ్యవహారాలు నడుపుకుంటున్నరు. కష్టసుఖాలు పంచుకుంటున్నరు. అన్ని భాషలను, అనుభవాలను పాటలుగా, కథలుగా, ముచ్చట్లుగా మలుచుకుంటాసాగుతున్నరు. ఒక పక్క మార్పులకనుగుణంగా పదజాలం పెంచుకుంటా ఆ భాష విస్మృతమవుతుండగా మరోపక్క అభివృద్ధి చెందుతున్న వర్గాలు భాష మార్చుకునే ప్రయత్నాలు వేగంగా విస్తరిస్తున్నయి. నిజానికి వందసంవత్సరాల కిందటనే మాట్లాడే భాష రాసే భాషకావాల్నని, మాతృభాషే బోధనాభాష కావాల్నని వాడుక భాష ఉద్యమాలు నడిచినయి. పత్రాలు రాసుకున్నరు. ఫలితాలు కనిపించినయి. తీరా ఇంతకాలం తర్వాత చూస్తే తెలంగాణ వాళ్ల తలలమీద పెద్దభారాలు మోపబడి ఉన్నయి. తుంట ఎత్తేసి మొద్దు ఎత్తుకున్నట్టయింది. ఇక్కడ మాట్లాడే భాష రాసే భాష కాలేదు. బోధించే

భాష అంతకన్నా లేదు. కాగా - మాట్లాడే భాషకు మొదటికే వొట్టమొచ్చింది. తెలంగాణ భాష అంచెలంచెలుగా నిశ్శబ్దంగా ముంపుకు గురయితున్నది.

'తెలంగాణ', 'ఆంధ్ర', రెండు పదాలూ ప్రాంత సూచకాలుగనే వాడుకలోనికివచ్చినయి. 'తలైంగ్' జాతీయులు నివసించిన ప్రాంతం తెలంగాణగా, 'అంధక' సంతతి జాతి నివసించిన ప్రాంతం 'ఆంధ్ర'గా స్థిరపడ్డాయి. ప్రాంతాల వారి ప్రత్యేకతలతోనే భాషలు వికసించి తదనంతరం తెలుగు రూపొంది ఉండాలి. చారిత్రకంగా కొన్ని సంవత్సరాలు ఒకే పాలనలో ఉండటం వల్ల, మరిన్ని వందల సంవత్సరాలు వేర్వేరు పాలనలో ఉండటం వల్ల భాష, సంస్కృతి, జీవనంలో అనేకమార్పులు సంభవించినయి. భాషా విషయకంగా సాంస్కృతిక విషయంగా పోలికలెన్ని ఉన్నయో వ్యత్యాసాలన్నీ ఉన్నయి. రెండు ప్రాంతాల వారిదీ తెలుగే అయినా పదజాలంలో, క్రియారూపాల్లో, వాక్యనిర్మాణంలో, ఉచ్చారణలో ఎవరి ప్రత్యేకతలు వారికున్నయి. ఆయా ప్రాంతాల ప్రజలు తమ అవసరాలకోసం రూపొందించుకున్న తెలుగు, ఉమ్మడి అవసరాలకోసం రూపొందిన తెలుగు భిన్నరూపాలు పొందింది. మొదటిది వ్యవహారభాషగా మాండలికంగా రెండోది పాలనాభాషగా గ్రాంధికభాషగా గుర్తింపుపొందింది. సుదీర్ఘంగా సాగిన పరిణామ క్రమంలో 'తెలుగు' 'తెనుగు' మాత్రమే భాషాసూచిగా వ్యవహారంలో ఉన్నది. తర్వాత్తర్వాత ప్రాంతసూచిగా ఉన్న 'ఆంధ్ర' శబ్దం భాషాసూచిగా వాడటం మొదలైంది. చిన్నయసూరి రాసిన 'బాలవ్యాకరణం'లో సంస్కృత, ప్రాకృత భాషలతోపాటు 'తెనుగు' భాషను పేర్కొన్నాడు. ప్రౌఢవ్యాకర్త దానికి 'ఆంధ్ర' భాషను జోడించిండు. 'తెనుగునకు వర్ణములు ముప్పదియాఱు' అని చిన్నయసూరి, 'ఆంధ్రమునకు వర్ణములు ఏభది ఆఱు' అని సీతారామయ్య చెప్పినారు. స్ఫూర్తిశ్రీ వ్యాఖ్యానం రాస్తూ 'తెనుగు', 'ఆంధ్రము' రెండింటిని వ్యాకరణకారులు వేర్వేరుగా గుర్తిస్తారని సాహిత్య లౌకిక వ్యవహారంలో ఒకటిగా చెలామణి అవుతున్నాయని వివరించి మేలు చేసినాడు. వ్యాకరణకారుల అభిప్రాయం శిరోధార్యమని కాదుగాని రెంటి మధ్య భిన్నత్వమున్నదని అంగీకరించవలసి ఉన్నది. ఉమ్మడి అవసరాల ప్రాతిపదికన ఒక 'తెలుగు' తెరమీదికి రావొచ్చుగాని ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల ప్రజలు వేర్వేరు 'తెలుగు'లు వాడుతున్నరని గుర్తించవలసి ఉన్నది. ఆంధ్రప్రాంతంవారి తెలుగు 'సంస్కృత తత్సమాల' తో కూడి 'ఆంధ్రభాష'గా ఎట్లా గుర్తింపు పొందిందో ఉర్దూ తత్సమాలతో కూడిన 'తెలంగాణ భాష' అట్లా గుర్తింపు పొందవలసి ఉన్నది.



తెలంగాణ భాష వాడకానికి అడ్డంకిగా మారిన పెద్ద సమస్య ప్రామాణిక భాష. వాడుక భాషా ఉద్యమ నిర్మాతలైన గిడుగు, గురజాడలు ప్రజల భాషను గౌరవించి వాచకాల్లోకి, రచనల్లోకి తీసుకొచ్చినరు. వాళ్లు మొదలు పెట్టిన ఉద్యమం వారి వారసుల చేత హైజాక్ చేయబడింది. తెలంగాణ ప్రజల భాషకు జరిగిన ద్రోహం యాదృచ్ఛికం కాదు. 'గ్రాంధికభాష' పీడనమీద 'వ్యావహారిక భాష' పేరన పోరాడిన ప్రగతిశీలురు 'అధికారం' అందిపుచ్చుకున్న తర్వాత ప్రజల భాష అర్థంకాదని మాట్లాడుతున్నరు. ప్రాంతాలవారి భాషాభేదాలున్నాయిగనక అవన్నీ 'అనాగరిక భాషలనీ', 'బజారుభాష'లనీ, 'గ్రామ్యా'లనీ, అర్థం చేసుకోవడం కష్టమనీ, లక్షణవిరుద్ధమైనవనీ, అవి ప్రయోగానికనర్హమని, అందుకు సరళగ్రాంధికమే సరైన పరిష్కారమని గ్రాంధిక భాషావాదులు ఆ రోజుల్లో వాదించారు. కోస్తా ప్రాంత ప్రజలు మాట్లాడే 'వస్తాడు' 'తెస్తాడు' లాంటిభాష ప్రయోగానికి అనర్హమని చిన్నయసూరి బాలవ్యాకరణంలో శాసించిండు. ఈ వాదాల పట్ల ఉద్యమించి, మాట్లాడేభాషను పుస్తకాల్లోకి తెచ్చి గుణాత్మకమైన మార్పును సాధించినవారే అధికారపీఠం ఎక్కి ప్రామాణిక భాషరాయాలని ఫర్మానాలు జారీ చేస్తున్నరు. ప్రజలవి 'మాండలికాల'ని 'ప్రాంతీయాల'ని అర్థం చేసుకోవటానికి తలలు బద్దలుకొట్టుకోవాలని, అందుకని 'ప్రామాణిక భాష' ఒకటుండాలని గ్రాంధిక భాషావాదుల మాటలే 'కోటింగ్' మార్చి మాట్లాడుతున్నరు. ఆనాడు 'వ్యాకరణగ్రంధాలు' చేసిన పని ఈనాడు 'పత్రికలు' చేస్తున్నయి. 'వస్తాడు' 'తెస్తాడు' రాయొద్దని అంటే పోరాడిన రచయితలు 'వచ్చిండు' 'తెచ్చిండు'రాయొద్దని అడ్డుకుంటండ్రు. వ్యావహారిక భాషా ఉద్యమ లక్ష్యం 'కోస్తాభాష అధికారం' వరకే పరిమితమైందా అని ఆలోచించవలసి వస్తున్నది. అన్ని ప్రాంతాల ప్రజల మీద ఆ భాషే అన్యాయంగా రుద్దుతున్నరు. (చాలామంది) ప్రజల భాషను 'ప్రాంతీయభాష'గా చేసి (కొన్ని) పత్రికల భాష 'ప్రామాణిక భాష' చేయటంలో కుత్సితమైన రాజకీయకుట్ర దాగిఉన్నది. గ్రాంధికభాష అందరికీ ఒకటిగా ఉండి కూడా ఏరకంగా సామూహిక ప్రయోజనాలకు ఉపయోగపడలేదో అదేవిధంగా ప్రామాణిక భాష కూడా సమిష్టి ప్రయోజనాలకు ఉపకరించదు. 48 హిందీ భాషల్ని దారుణంగా అణిచివేసి కాశీపండితుల హిందీ మాత్రమే అసలు హిందీభాషగా చెలామణి అయినట్టే, 4 తెలుగు భాషల్ని అణిచివేసి 'కోస్తా సంపన్నుల భాష' మాత్రమే అసలైన తెలుగు భాషగా ఆధిపత్యం చేస్తున్నది.

స్వాతంత్ర్యానంతరం భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు చేయటంలో ఎవరి ప్రయోజనాలు వాళ్లకున్నయి. స్వతంత్ర ప్రభుత్వం మీద ఎన్నో ఆశలు పెట్టుకొన్న ప్రజలు మార్పులన్నింటినీ

సహృదయంతో స్వీకరించినారు. మాతృభాషలో విద్యాబోధన జరగాలని తీవ్ర ప్రయత్నాలు జరిగినయి. రాజ్యాంగంలో రాసుకొని ప్రణాళికల్లో పేర్కొని 'ఆధునిక భాషల అభివృద్ధి కమిటీ'ల ద్వారా కృషి జరిగింది. అయినా ఎక్కడి భాషలక్కడే ఉన్నయి. సుమారు రెండుకోట్ల మంది మాట్లాడే తెలంగాణ మాతృభాషను రాజ్యాంగం గాని, ప్రణాళికలు గాని, అభివృద్ధి కమిటీలు గాని గుర్తించలేదు. 'మాతృభాషలో విద్యాబోధన' అనే సాధారణ సూత్రీకరణ పైకి కన్పించినంత శాస్త్రీయమైందికాదు. 'మాతృభాష' అంటే సరైన వివరణ ఇవ్వకుండా సాధారణీకరించటం చాలా సమస్యలకు దారితీస్తున్నది.

తెలంగాణగడ్డ మీద పుట్టి పెరిగిన పిల్లలు పాఠశాలకు వెళ్లి అయోమయానికి గురయితుండ్రు. కుటుంబంలో సమాజంలో నేర్చుకున్న భాషకూ పాఠశాలల్లో నేర్పుతున్న భాషకూ పొంతన కుదరక తండ్లాడుతుంటరు. ఇక్కడి పిల్లల మాతృభాష తెలంగాణ తెలుగేకాని కోస్తాంధ్ర భాష ఎంత మాత్రం కాదు. సమాజాభివృద్ధిలో సాంస్కృతిక నిర్మాణంలో ఉపాధ్యాయుడు బోధించే భాష చాలా కీలకమైంది. తరగతి గది విద్యార్థిజీవితం మీద బలమైన ప్రభావం చూపుతుంది. 'భాష' పైకి చిన్నవిషయంగా పట్టించుకోదగిన విషయంగా కనిపించక పోవచ్చునుగాని అనేక కోణాల్లో దానిప్రభావం విశేషంగా ఉంటది. పాఠ్యపుస్తకాల్లో ఉండే భాష నిశ్శబ్దంగా ఉపాధ్యాయుని విజ్ఞానాన్ని అనుమానిస్తది. ప్రచురణ సంస్థలు, రచయితలు వాడిన కోస్తా భాషనే తెలంగాణ ఉపాధ్యాయులు నేర్చుకొని విద్యార్థులకు నేర్పవలసిన పరిస్థితి తయారు చేసివున్నది. ఆంధ్రపాలకుల విజయరహస్యం ఇక్కడ ఉన్నది. బడినుంచి మొదలు యూనివర్సిటీల దనుక సమస్త పాఠ్య గ్రంథాలు ఉపయోగించిన భాషే ప్రామాణికం గనుక ఇక్కడి విద్యార్థులు అన్ని పరీక్షలు ఆ భాషలోనే రాయాలె. అంటే - తమదికాని భాషలో చదువుకొని, నేర్చుకొని, వ్యవహరిస్తే తప్ప జీవితంలో నిలదొక్కుకోలేరు. చదువుకునే రోజుల్లో అర్థం కాలేదు గాని 'హొయ్యి' అంటే పుస్తకమనేదాకా 'కమ్మ' అంటే పేజి అనేదాకా మా మట్టలు వాయగొట్టేవాళ్లు సార్లు. మాతృభాషనుంచి క్రమబద్ధంగా దూరంకావటానికి వీలుగా ఆమోదయోగ్యంగా ప్రణాళికలు రూపొందించిండ్రు నవీన పండితులు.

ఆంధ్రప్రభుత్వం "తెలుగు అకాడమీ" ఏర్పాటు చేసిన తర్వాత పాఠ్యపుస్తకాల ద్వారా తెలంగాణ విద్యార్థులకు జరిగిన నష్టం ఎంతో తేల్చిచెప్పటం కష్టం. ప్రాంతీయ విశ్వవిద్యాలయాలు స్వయం ప్రతిపత్తి కోల్పోయినయి. 'కామన్ కోర్ సిలబస్' కామన్ ఎంట్రన్స్ సిస్టమ్' మొదలైన విధానాల వెనక వంచనపూరితమైన ఉద్దేశ్యాలున్నయి. 'యంసెట్' కోచింగ్‌లు రకరకాల ర్యాంకుల పోటీలు వచ్చింతర్వాత తెలంగాణ విద్యావ్యవస్థ మొత్తం కుప్పకూలిపోయింది. తెలంగాణ విద్యార్థులు ఆంధ్రప్రాంతంలోని రెసిడెన్షియల్ కళాశాలలో చదువుకొనటానికి వెళ్లి డబ్బుమాత్రమే కాదు, భాషమాత్రమే కాదు, తెలంగాణ తత్వమే కోల్పోతున్నరు.

ఉద్యోగావకాశాల్ని కేంద్రీకరించటం, ఒకే రకమైన విద్యార్హతలు నిర్ణయించడం, చారిత్రకంగా ఏర్పడిన నేపథ్యాలతో సంబంధంలేకుండ అన్ని ప్రాంతాలకు ఒకే రకమైన పోటీపరీక్షలు, సర్వీసు పరీక్షలు నిర్వహించటం వల్ల మొత్తంగా తెలంగాణ విద్యార్థుల మనోవికాసం, అభివృద్ధి నిరోధించబడినయి. భాషద్వారా శాంతియుతంగా మనిషినీ, ఆత్మనూ ఎట్లా ఆక్రమించుకోవచ్చునో స్వాధీన పర్చుకోవచ్చునో ఈ క్రమపరిణామం నిరూపిస్తున్నది. ఇక్కడి విద్యాధికులు, అభివృద్ధి వర్గాలు, రాజకీయనాయకులు, రచయితలతో సహా భాషపట్ల గానీ, ఇతరత్రాగానీ ఆత్మగౌరవం విడిచిపెట్టి బలిపెట్టి బతుకు ఎల్లవొయ్యాల్సిన కర్మవెనుక ఈ తతంగమంత ఇమిడిఉన్నది.

ఒక ప్రాంతం రాజకీయ, సాంస్కృతిక విజయం వెనుక ఆ ప్రాంత వనరుల అభివృద్ధి, వ్యాపార, ఉద్యోగ అభివృద్ధి, భాషా సాహిత్యాల ప్రసారసాధనాల అభివృద్ధి రాజకీయ చైతన్యం ప్రధానంగా వుంటయి. వాటితో పోటీ పడకుండ మరోప్రాంతం అస్తిత్వం కాపాడుకోవటం కష్టం. తెలంగాణ అభివృద్ధికి అవసరమైన వనరుల కోసం కలెబడాలె. ఆంధ్ర పత్రికలతో, పుస్తక ప్రచురణలతో తెలంగాణ పత్రికలు, పుస్తకాలు ధీటుగా నిలబడనంతకాలం తెలంగాణ భాషకు స్థానం దొరకదు. గతంలో ఉవ్వెత్తున ఎగిసిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి రాజకీయ, ఉద్యోగ కోణాలు ప్రధానంగా ఉన్నయి. ఈనాటి తెలంగాణ ఉద్యమానికి వనరుల దృక్కోణంతో పాటు సాంస్కృతిక దృక్కోణం సుత పెనవేసుకుంటున్నది. రచయితలు, మేధావులు, రాజకీయనేతలు సాంస్కృతిక స్వేచ్ఛకోసం ఆలోచించాలె. ఇక్కడి ప్రజల భాష గౌరవం పొందాలంటే పాఠ్యభాషగా సాహిత్యభాషగా ప్రసారభాషగా పాలనాభాషగా తెలంగాణ భాష విశిష్టస్థానాలు పొందవలసి ఉన్నది.

*- తెలంగాణతోవలు, సెప్టెంబర్ 2001*

# తెలంగాణ వ్యావహారిక భాష - తీరుతెన్నులు

**భా**షల వికాసం వెనుక రాజకీయాలుంటయంటే చాల మందికి ఒప్పుకోబుద్ధికాదు. ప్రతి విషయానికి అలవాటు ప్రకారంగా రాజకీయాలంటగడుతరుగానీ భాషకూ రాజకీయానికి సంబంధం మేముంటదని చులకనగ మాట్లాడుతుంటరు. మానవుని జీవన అవుసరంలనుంచి భాష పుడతది. ఒక జీవన విధానం గలిగిన సమూహంల అది భావ వినిమయ సాధనంగా వ్యాప్తిల ఉంటది. అయితే అది వ్యావహారిక భాషగా ప్రామాణిక భాషగా అధికార భాషగా వికసించే పరిణామ క్రమం వెనుక దాగిఉన్న కారణాల్ని వెదికి పట్టుకోవటానికి హేతుబద్ధంగా ప్రయత్నిస్తే రాజకీయం దగ్గరే తేలుతం. ఇప్పుడు మన కండ్ల ముందట జరుగుతున్న 'ప్రాచీన భాష హోదా' సంగతినే గమనిస్తే బోధపడేదేమిటి? ఒక భాష ఆ హోదా పొందేతందుకు గాని, ఇంకొక భాష మళ్లా ఆహోదా పొందుకుంట నియమనిబంధనలు సవరించుటం వెనుకగానీ రాజకీయాలు తప్ప ఏమీ లేవు. సరిగ్గా తెలంగాణ వ్యావహారిక భాష పరిస్థితి గూడ అంతే. ప్రజల వ్యవహారంల బతుకుతున్నది, వర్ధిల్లుతున్నది తప్ప ఇతరత్రా ఏ వికాసదశనూ అందుకోలేక పోతున్నది. అవసరమయిన సమయంల సరయిన రాజకీయ అండదండలంది ఉంటే తప్పకుంట ఎంతగానో వికాసాన్ని పొందేటిది.

ఒక జాతి సాంస్కృతిక వికాసంల భాష చాల కీలకమైంది. భాష సున్నితమైన విషయమే కాదు లోతయిన విషయం కూడా. లోకంలోని జ్ఞానమంతా భాషరూపంలనే ఉంటది, విశేషమైన అనుభవసారమంత భాష రూపంలనే వ్యక్తీకరించబడుతది. చరిత్ర, శాస్త్రాలు అన్నీ పరంపరగా తరతరాలకు అందించే నిరంతర ప్రక్రియ కూడా భాషతోనే కొనసాగుతుంది. ఆ భాష అణచివేతకు గురయితున్నదంటే ఆ జాతి జ్ఞానమంతా అణచివేతకు గురయి అంతరించవచ్చు. తెలంగాణ విషయంలో ఇదంత జరుగుతున్న వాస్తవం. తెలంగాణ వ్యావహారిక భాష ఆంధ్రభాష కౌగిలిల ఊపిరి సలపడంలేదంటే ఆ స్థాయిల స్థానికచరిత్ర, సంస్కృతులు, స్థానిక జ్ఞానసంపదలు భంగపడి కనుమరుగయితున్నయని అర్థం



చేసుకోవచ్చు. తెలంగాణ వ్యవహారిక భాష ఎదుర్కొంటున్న అణచివేత కేవలం భాషకు సంబంధించినది మాత్రమే కాదు. బోలెడు కోణాలున్నయి.

విద్యారంగంల తెలంగాణ వ్యవహారిక భాష ఒక సమస్యగా మారుతున్నది. పాఠ్యాంశాలు, బోధన, పరీక్షలు ఏవీ వ్యవహారిక భాషల కొనసాగడంలేదు. పరిసరాలు నేర్పుతున్న భాషకు, పాఠశాలలు నేర్పుతున్న భాషకు నడుమ వైరుధ్యం పెరుగుతూ ఉన్నది. విద్యావంతులల్ల భాష సమస్యగా మారుతున్నది. పని పాటల ప్రజలు అరమరికలు లేకుంట అవసరం మేరకు భాషను వాడుతున్నారు. వ్యవహారం సజావుగా సాగిపోతున్నది. చదువుకున్నవారిలోనే సమస్య ఉత్పన్నమౌతుంది.

మాట్లాడే భాషకు, రాసే భాషకూ నడుమ పెరుగుతున్న అంతరమే సమస్యకు ప్రాతిపదిక. అనేక సందర్భాలల్ల ఈ సమస్య ప్రధానంగా రచనా భాషకు సంబంధించినదే. తెలంగాణలో విద్యావంతులు రెండు వింతైన సమస్యలు ఎదుర్కొంటున్నరు. రచనా భాషగా దేన్ని ఎంచుకోవాలె? తెలంగాణ వ్యావహారిక భాషనా? తెలుగు ప్రామాణిక భాషగా చెలామణి అయితున్న ఆంధ్రభాషనా? ఒక వేళ తెలంగాణ వ్యావహారిక భాష ఎంచుకుంటే జీవితాన్ని ప్రతిబింబించవచ్చు గానీ ఆ రచనకు తెలుగు సాహిత్యపు ప్రధాన స్రవంతి ప్రతిస్పందించక పోవచ్చు. ప్రామాణిక భాషను ఆశ్రయించుదామంటే సాహిత్య ప్రపంచం స్పందించవచ్చునేమో గాని జీవితాన్ని కృతకభాషతో అందుకోలేక పోవచ్చు. ఏదీ తేల్చుకోలేని సంకటస్థితినుంచి బయటపడలేక పోతున్నరు. రాయాలనుకున్నా తెలంగాణ వ్యావహారికభాష రాయలేనంతగా పరాయీకరణకు లోనయిన పరిస్థితి కూడా బాధపెడుతున్నది.

రెండోది మాట్లాడేభాష. డిగ్రీలు పుచ్చుకున్న తర్వాత పాఠ్యగ్రంథాల భాషైన ప్రామాణిక తెలుగు మాట్లాడకుంటే విద్యావంతుడనుకోరనే భయం? పోనీ, పాఠ్యగ్రంథాల భాషే మాట్లాడుదామంటే స్థానికంగా వ్యవహారం సాగదు. అందువల్ల ఇంట్ల, ఊర్ల వ్యవహారభాష, ఉద్యోగం చేసేచోట స్థానికుల్లో ఒక భాష పై అధికారులతో, స్థానికేతరులతో, తరగతి గదులల్ల, సభలల్ల ప్రామాణిక భాష మాట్లాడవలసిన బహుముఖ స్థితి ఏర్పడుతున్నది. మాట్లాడే భాషకూ, రాసేభాషకూ అంతరాలు, మాట్లాడే భాషల్లో మళ్ళా ఆయా సందర్భాన్ని బట్టి ఉత్పన్నమవుతున్న అంతరాలు తెలంగాణ భాష వ్యవహారాన్ని అయోమయంలో పడేస్తుంది. భాష దగ్గర మొదలైన లొంగుబాటు క్రమంగా అనేక దశలకు దారితీసినందువల్ల తీరని నష్టం వాటిల్లుతున్నది. 'భాషను కోల్పోయి బానిసలమయ్యాం. బానిసంటే చరిత్రలో భాష కోల్పోయినవాడే'నని తెలంగాణ కవి వ్యధచెందుతున్నడు.

తెలుగుభాష అంతా ఒకటే అని పైకి మాట్లాడుడు సులభమే. ఆచరణలో ఒకటిగా భావించుడు సాధ్యమైతలేదనేది వాస్తవం. భాషకు హెచ్చుతగ్గులుండవు. భావనలోనే వ్యక్తమవుతున్నాయి. ఏ ప్రాంతానికయినా రాజకీయాధిపత్యానికి ఆర్థికాధిపత్యం ముఖ్యం. ఈ రెండు ఆధిపత్యాల ఆధారంగా సాంస్కృతిక ఆధిపత్యం సాధ్యమౌతుంది. భాషాధిపత్యం దాంట్లో భాగమే. ఒక ప్రాంతభాష ఆధిపత్యస్థానాలకు వచ్చింతర్వాత ఇతర ప్రాంతీయ భాషలను అధికారానికి దూరంగ ఉంచుతది.

తెలంగాణ ప్రాంతంలో పురాతన కాలం నుంచే భాషల నడుమ ఆధిపత్యాల ఘర్షణ కొనసాగినట్లు తెలుస్తుంది. బృహత్కథ రాసిన గుణాఢ్యుని కాలంలో ప్రజల వ్యవహారంలో ఉన్న స్థానిక భాషలకు, పండితులకు తెలిసిన సంస్కృత భాషకు ఘర్షణ ఉన్నది. రాజుకు తెలిసిన ప్రాకృతాన్ని రాణికి తెలిసిన సంస్కృతం ఎగతాళిచేసింది. ఇద్దరు పండితుల వాదులాటలో గెలిచిన శర్వవర్మ సంస్కృతానికి, ఓడిన గుణాఢ్యుడు స్వీకరించిన పైశాచీ భాషకూ అంతరాలు, ఘర్షణలు ఉన్నట్లు తోస్తున్నది. మార్గ కవిత్వానికీ, దేశి కవిత్వానికీ నడుమ ఆంధ్రభాషకూ జానుతెనుగుకూ నడుమ వైరుధ్యాలున్నయి. తెలంగాణ నుంచి వచ్చిన అచ్చతెనుగు కావ్యాలను సంస్కృతాంధ్రం ఆమోదించకపోవటానికి వెనుక కారణాలున్నయి. కాగా అసఫ్‌జాహీల కాలంలో అరబ్బీ, పారశీల ఆధిపత్యం కొనసాగింది. దానికనుగుణంగా ప్రజల వ్యవహారభాషలు నిందారోపణలు ఎదుర్కొన్నయి.

'అరబ్బీ భాష అమృతం. పార్సీ తేనె. ఉర్దూ కండశర్కర. తక్కిన భాషలన్నీ ఒంటికాలికింది దుమ్ము' అని అరబ్బీ పండితులు స్థానిక తెలుగును తులనాడినారు.నిజాం హయాంల 1884ల పర్షియన్ స్థానంల ఉర్దూ అధికార భాష అయింది. ఉర్దూ బోధనాభాష, పాలనాభాష కావటం వల్ల తెలంగాణ భాష అణచివేతకు గురయింది. తెలంగాణ వ్యవహారిక భాషలోకి ఉర్దూ చొచ్చుకొని వచ్చింది. అరబ్బీ ఉర్దూ పదాలు సమ్మిశ్రితమై తెలంగాణ భాష కొత్తరూపం సంతరించుకొని విలక్షణంగ రూపొందింది. సంస్కృతాంగ్ల ప్రభావాల్తో కోస్తా భాష, ప్రాకృత పార్సీ ఉర్దూ ప్రభావాలతో తెలంగాణ భాష రెండింటి నడుమ మరింత దూరం పెరిగి రెండు ప్రాంతాల తెలుగుల నడుమ కావల్సినంత వైవిధ్యం, వైరుధ్యం చోటుచేసుకున్నయి. అందువల్ల వ్యవహార భాషంటే ఎవరి వ్యవహారభాష? ఏ ప్రాంత వ్యవహారభాష అనే ప్రశ్న వచ్చింది. వేర్వేరు పరిపాలనల కింద ఉండటం, వేర్వేరు రాష్ట్రాలుగా ఉండటం వల్ల ఆ చర్చ చర్చగానే ఉండిపోయింది.



వ్యావహారిక భాషా ఉద్యమం వచ్చేదనుక గ్రాంథికభాష అధికారంల ఉన్నది. గ్రాంథిక భాష అందరికీ అర్థం అయితలేదని .ఆరోపణను ఎదుర్కొన్నపుడు దాన్ని సులభతరం చేసి సరళగ్రాంథికంగా మలచి అధికారం నడిపే ప్రయత్నం జరిగింది. వ్యావహారిక .భాషోద్యమం అంతటితో తృప్తిపడలేదు. ముందుకు నడిచింది. ఉత్తరాంధ్రను దాటి అభివృద్ధి ఫలితాలందుకొని అధికార స్థానానికి చేరువయిన కోస్తా వ్యవహారభాష కొత్తగా ప్రామాణిక భాషను రూపొందించి ముందుకు తెచ్చింది. తెలంగాణ ప్రాంతీయభాషను పక్కకుపెట్టే ప్రయత్నాలు ప్రారంభమయినయి. 1946లో ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు విద్యాపీఠం ప్రారంభించి తనికెళ్ళ వీరభద్రుడు చేసిన ప్రసంగం ఒకసాక్ష్యం. "బజారు భాష సాహిత్యమునకు పనికిరాదు. ఒకప్రాంతీయ భాషను మాత్రమే సారస్వతంలో వాడిన ఇతర ప్రాంతీయుల తెలుగువారికి అర్థంకాదు". వీరభద్రుడు చెప్పినది గ్రాంథికభాషను దృష్టిలో ఉంచుకొనే అయినా రాబోయే ప్రామాణిక భాషదర్పాన్ని సూచిస్తున్నది. ప్రాంతీయ భాషను ఆయన దృష్టిలోని తెలంగాణ భాషను బజారుభాషగా తృణీకరించుడు ఏ సంస్కారాన్ని ప్రదర్శిస్తున్నదో ఏ ప్రయోజనం వెనుక ఉన్నదో గమనించవచ్చు. దాన్ని సురవరం ప్రతాపరెడ్డి తీవ్రంగా నిరసించారు. 'ఏ భాష ఇతర భాషలకింద ఆడబాపగానుండునో దాని సంస్కృతి వినాశనమగుచున్నదన్నమాట' అని తెలంగాణ భూస్వామ్యవ్యవస్థనూ కోస్తా కొత్త అధికార ధోరణిని స్థానిక ప్రతీకతో ప్రతిఘటించినాడు.

'ప్రామాణికభాష' అనేది తెలగాణ వ్యవహారభాషను కనిపించని అణచివేతకు గురిచేసింది. స్థానిక వ్యవహారభాషలోని వైవిధ్యాన్ని గుర్తించనివ్వకుండ, ప్రదర్శించనివ్వకుండ కట్టడిచేసి దురాక్రమణ చేసింది. అన్ని ప్రాంతాలవారికి అర్థం కావటమనే ప్రమాణాన్ని ఒకప్పుడు గ్రాంథికభాష అడ్డుపెట్టుకొని అధికారం చెలాయించుతే, దానిమీద ఉద్యమించిన వ్యవహారిక భాష అధికార స్థిరీకరణకు అదేవాదనను ప్రయోగించుడు విచిత్రం. "ఇతర ప్రాంతాల ఆంధ్రులు వీరి రచనలను ఇక్కడి ఆంధ్రులంత ఆనందముతోటి చదువలేకపోవుట తటస్థిస్తున్నద"ని నిజాం రాజ్యంలో ఉద్యోగ నిమిత్తం వచ్చిన మానేపల్లి తాతాచార్య వ్యాఖ్యానించినాడు. కాగా వేదం వేంకటరాయశాస్త్రి గద్వాల జనుల భాషను, లిపిని 'ఇదేమి భాష, కన్నడమా?' అని పరిహసించినాడట. ఇవన్నీ దేన్ని సూచిస్తున్నయి? వలసవచ్చినా, సందర్శనార్థం వచ్చినా ఇక్కడి భాషపట్ల వాండ్ల అసహనాన్ని వివరిస్తున్నది. 'పదాలలో సత్త్వం లేదని, ప్రామాణికత లేదని, సాహిత్య రచనకు కావలసిన శక్తి లేదని, వెనుకబడిందని, మోటుగా ఉంటుందని, అన్ని రసాలు పలకదని, చర్చకు పనికిరాదని' తెలంగాణ భాషను

తరచుగా నిందించినారు. ఆ అపవాదు ఒకప్పుడు సంస్కృతం నుంచి తెలుగుభాష ఎదుర్కున్నది. తర్వాత గ్రాంథిక భాషనుంచి వ్యవహారభాష ఎదుర్కున్నది. తదనంతరం అదే అపవాదు కోస్తా వ్యావహారిక భాషనుంచి తెలంగాణ వ్యవహారికభాష ఎదుర్కొంటున్నది. అయితే గ్రాంథిక భాష ఎట్లా అన్ని ప్రాంతాల ప్రయోజనాలు నెరవేర్చలేక పోయిందో ప్రామాణికభాష కూడా అన్ని ప్రాంతాల ప్రయోజనాలు కాపాడడంలో విఫలమైంది.

కాలగతిలో తెలుగులోని ఎన్నో పదాల్ని నలిపేసి సంస్కృతం వెలిగింది. మరిన్ని పదాల్ని నులిమేసి ఉర్దూ వెలిగింది. ఇప్పుడు ప్రాంతీయ వ్యవహారంలోని ఎన్నో మాండలిక పదాల్ని మాయం చేసి కోస్తా ప్రామాణిక భాష వెలుగుతున్నది. ఆయా సందర్భాలవల్ల కాలాలవల్ల ఈ అన్ని పరభాషల దాడుల్ని, ఆటుపోట్లను తట్టుకొని, కలుపుకొని తెలంగాణ వ్యవహారిక భాష నిలదొక్కుకుంటూ స్థానిక భాషాసువాసనలను కాపాడుకుంటూ వస్తున్నది.

ప్రాంతీయ భాషలే ప్రజల జీవితాలకు దగ్గరగా ఉంటాయి. సామాన్యజనంల ఇవి వ్యాప్తి చెందినంతవేగంగా మరేవీ వ్యాప్తిచెందలేవు. స్థానిక భాషలనే స్థానిక జీవితం ప్రతిబింబించి సజీవంగా ఉంటది. జీవితంపట్ల తన విధానం తన భాషలనే తన భాషాసాహిత్యంలనే వ్యక్తమవుతయి. స్థానిక ప్రజల కష్టసుఖాలు, కడుపుతీపి, కన్నీళ్ళు, కోరికలు, కొట్లాటలు, కోపతాపాలు, చమత్కారాలు, సంబురాలు, స్పందనలు, వ్యావహారిక భాషే సరిగా వ్యక్తీకరించగలుగుతుంది. జీవితాన్ని నిజాయితీగా ప్రేమించే ఏ రచయితయినా ప్రజల భాషనే స్వీకరిస్తాడు. ప్రామాణికత సాపేక్షం. సందర్భాన్నిబట్టి స్థలాన్ని బట్టి నిర్ణయమయితది. రచయిత ప్రజల ప్రతినిధి. ప్రజా వ్యవహారమే తనకు ప్రధానం.

టాగోర్ అంటడు, "ప్రజల భాషలో రాయడం తమ హోదాకు తక్కువని భావించేవారు. రాసే శ్రమ తీసుకోనక్కరలేదు". విద్యావంతులైన అనేకులు అనేక రకాలుగా పరాయీకరింపబడితే జానపదులే భాషా సంస్కృతుల్ని పరిరక్షించి వ్యాప్తిలో ఉంచుతారు. రచయితలు వాటిని క్రమబద్ధంచేసి తమ రచనల ద్వారా రికార్డుచేసి సాహిత్యంగ సభ్య ప్రపంచానికందిస్తరు. తెలంగాణ వ్యవహార భాషను ఎన్నో ఆటుపోట్లనుంచి కాపాడుకుంట కాలానికందిస్తున్నది తెలంగాణ ప్రజలే. తెలంగాణ రచయితలు వాటి పరిమళాన్ని, మాధుర్యాలను, జీవన విశేషాలను సాహిత్యంలకు వొంపుతూ సజీవంగా ఉంచుతున్నరు.

1913ల తెలంగాణ పత్రిక 'హితబోధిని' తెలంగాణ వాడుక భాషలో ప్రహసనాలను ప్రచురించింది. పాలమూరు భాషలో సురవరం ప్రతాపరెడ్డి ఛందోబద్ధ పద్యాలు రాసి ప్రచురించినాడు. గోలకొండ పత్రిక, మీజాన్ పత్రిక తెలంగాణ భాషకు గొప్పసేవ చేసినయి.



ప్రతాపరెడ్డి కథల్లో స్థానిక భాషను వాడి విలక్షణతను ప్రదర్శించిండు. వట్టికోట ఆళ్వారుస్వామి నవలల్లో కథలల్లో తెలంగాణ వ్యవహారభాష ప్రయోగించిండు.

కాళోజీ కవితలల్లో, కథలల్లో స్థానిక భాష ముద్ర ఉంది. దాశరథి రంగాచార్య నవలలు ఇక్కడి భాషల రచింపబడి ప్రాచుర్యం పొందినయి. కాగా, ప్రాంతేతరులు సుంకర, వాసిరెడ్డిలు రచించిన 'మా భూమి' నాటకంలో తెలంగాణ రైతాంగ పోరాట క్రమం ఉన్నప్పటికి తెలంగాణ వ్యవహారిక భాష లేకపోవటం వల్ల ఇక్కడి ప్రజలకు చేరువకాలేదు.

తెలంగాణ రైతాంగ ఉద్యమం అనంతరం తెలుగు సాహిత్యం చాలావరకు ఉద్యమ చిత్రణతో నిండిపోయింది. ఇతరప్రాంత రచయితలు ఇక్కడి జీవితంలోని స్ఫూర్తిని ప్రేరణగా గ్రహించినప్పటికి ఇక్కడి భాషను రచనా భాషగా అందుకోలేకపోవటం వల్ల ఇక్కడి ప్రజల దృష్టిని ఆకర్షించలేదు. తెలంగాణ భాషకు సంబంధించిన చర్చ సాగుతున్నప్పుడు చాల మంది రచయితలు, ప్రజాస్వామిక వాదులు సానుకూలత ప్రకటించనప్పటికీ శ్రీశ్రీ ముందుచూపుతో తెలంగాణ భాషను సాహిత్యంలకు ఆహ్వానించటం విశేషం. 1953లో జరిగిన తెలంగాణ రచయితల సంఘం వార్షికోత్సవాలల్ల ప్రారంభోపన్యాసం చేస్తూ ప్రామాణిక భాషా ముసుగులోని కోస్తాంధ్ర వాదాన్ని కొట్టివేసినాడు శ్రీశ్రీ.

"తెలంగాణ రచయితలు తమ రచనలలో తెలంగాణను సమగ్రంగా చిత్రించాలి. తెలంగాణలో మాట్లాడే తెలుగు భాషకు కొన్ని ప్రత్యేకతలు, కొంత వైశిష్ట్యము ఉన్నది. ఇక్కడి రచయితలు ఇచటి ప్రజల దైనందిన జీవిత భాషనే వ్యక్తీకరించాలి. ఆ భాషను ఇతర ప్రాంతాల ఆంధ్రులు పరిహసిస్తారనే భయంతో ఇక్కడి రచయితలు వెనుదీయరాదు. ఆ మాటకొస్తే ఆంధ్రదేశంలో జిల్లాజిల్లాకు భాషలో భేదాలు ఉంటాయి. ప్రతి జిల్లా భాషలోనూ కొంత సొంపు ఉంటుంది." ఆ సొంపు సొబగు వ్యక్తం కావాలని శ్రీశ్రీ కాంక్షించినాడు. 1952-56 మధ్యకాలంలో హైదరాబాద్ రాష్ట్రం స్వతంత్రతను, స్వేచ్ఛాగాలులను పీల్చుకున్నది. ఆ కాలంలో తెలంగాణ వ్యావహారికభాష, సంస్కృతులు కొత్త వికాసాన్ని అందుకున్నయి. రాజకీయాల నుంచి సాహిత్యం దనుక విస్తరించిన తెలంగాణభావన వ్యవహారభాషకెంతగనో ఊతమిచ్చింది. తెలంగాణ రచయితల సంఘం, సాధన సమితి వంటి సంస్థలు అణాగ్రంథమాల, దేశోద్ధారక గ్రంథమాల వంటి ప్రచురణ సంస్థలు, పత్రికలు తెలంగాణ పలుకుబడులను నుడికారాన్ని భాషను ప్రోత్సహించినాయి. సురమౌళి తెలంగాణ భాషల కథలు ప్రచురించిండు. వెల్దుర్తి మాణిక్యరావు మరెందరో రచయితలు కథల్లో ఇక్కడి భాషను ప్రయోగించారు. అయినా మరొక న్యూనత వెంటాడుతూనే ఉన్నది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తెలంగాణ భాషకు అగ్నిపరీక్ష. విశాలాంధ్రల ప్రజారాజ్యం ఏమోగాని ప్రజల భాషకు కూడా స్థానం దొరకలేదు. తెలంగాణ రాజకీయం దెబ్బతిన్నట్లే తెలంగాణ వ్యవహారిక భాష కూడా సమైక్యరాష్ట్రంల చావుదెబ్బతిన్నది. ఎన్నడూ లేనంతగా తెలంగాణ భాష పరిహాసానికి గురయింది. తెలుగు అకాడమి ఏర్పాటుతో కోస్తా ప్రామాణిక భాష పాఠ్యభాష అయి, సినిమాలు రేడియోలు పత్రికలు తెలంగాణ భాషను అయోమయంలో న్యూనతలో పడివేసినయి.

1969-70 నాటి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం తర్వాత కవిత్వంల కథలల్ల తెలంగాణ భాష కొంత విస్తరించింది. మరొకపక్క విప్లవోద్యమాలు తెచ్చిన ప్రజాస్వామిక స్ఫూర్తి విద్యార్థి ఉద్యమాలు స్వీకరించే ప్రజావారసత్వం తెలంగాణ భాషను కొంతవరకు ఉత్సాహపరిచినయి. 'జీవనాడి' 'సృజన' పత్రికలు కవిత్వంలకు, కథలల్లకు తెలంగాణ భాషను పట్టుకొని తెచ్చినయి. ప్రజల నడుమకు వెళ్ళేందుకు ప్రజల భాషనే స్వీకరించి రచనలు ప్రచురించినయి. వాటి ప్రభావం ఆనాటి వ్యాపార పత్రికలమీద కూడా పడింది. పంచరెడ్డి లక్ష్మణ 'ఇసిత్రం' ,దేవరాజు మహారాజు 'గుడిసెగుండె', భాను 'ఊరోల్లు' కృష్ణమూర్తి యాదవ్ 'తొక్కుడుబండ' వంటి కవిత్వ సంకలనాలు, దేవరాజు మహారాజు 'కడుపుకోత', పడాల రాములు 'బలి', సదానంద్ శారద 'జాడీ' వంటి ఎన్నో కథలు తెలంగాణ భాషలో వెలువడినయి. విప్లవసాహిత్యం మాండలిక ప్రయోగాలమీద సవివరమైన చర్చ చేసి ప్రజల భాషను రచనాభాషగా ప్రత్యేకంగా ప్రయోగించినయి. అల్లంరాజయ్య రచనలు, రఘోత్తమరెడ్డి కథలు, గద్దర్, గూడ అంజయ్యల పాటలు జీవభాషను వాహికగా మలచుకున్నయి.

1990 తెలంగాణ రాష్ట్ర ఉద్యమం, ' మా తెలంగాణ' పత్రిక తెలంగాణ స్పృహను తిరిగి మేల్కొల్పిన తర్వాత వెనుకకు చూడకుండ తెలంగాణ వ్యవహారభాష విస్తరిస్తున్నది. చాలమంది కథకులు, కవులు తెలంగాణ భాషకు పట్టం కడుతున్న సందర్భం ఈ దశాబ్దంలో కనబడుతున్నది. ఇటీవలి 'పొక్కిలి', 'మత్తడి' సంకలనాలు తెలంగాణ భాషకు పెద్దపీట వేసినయి. 5000 పదాలతో నలిమెల భాస్కర్ తెలంగాణ పదకోశం తయారుచేసి ప్రచురించటం విశేషం. వ్యాకరణవేత్త రవ్వా శ్రీహరి 'తెలంగాణ మాండలిక ప్రయోగాల' మీద రాసిన వ్యాసాలతో పుస్తకం ప్రచురించినాడు. వేముల పెరుమాళ్ళు "తెలంగాణ జాతీయాలు" విశేష గ్రంథాన్ని వెలువరించిండు. వీటితో తెలంగాణ భాషలో జరుగవలసిన కృషిలో కొత్తకోణాలు ఆవిష్కృతమయినయి.



ప్రాంతీయ వ్యవహారభాషల్ల పలుకుబడులు, నుడికారం, జాతీయాలు విశేషంగా మెరుస్తుంటయి. భాషలో ప్రాంతీయ ముద్రకు కీలకమైనవి క్రియాపదాలే. వాటిని సంకోచాలు లేకుంట విరివిగా వాడుటంద్వారా ప్రాంతీయతను పరిరక్షించుకోవచ్చును. తెలంగాణ భాషను వెంటనే గుర్తుపట్టిచ్చేవి క్రియావాచకాలే. వాక్యనిర్మాణంల క్రియావాచకాల తర్వాత విభక్తిప్రత్యయాలు పేర్కొన తగినవి. అనుభవసారాన్ని తెలిపే అపురూప పదాలు, పదజాలం పదబంధాలు, పదచిత్రాలు, ప్రతీకలు అందుకొని తెలంగాణ భాషా ప్రేమికులు మాట్లాడే భాషలో ఉపయోగించినట్టుగా రాసే భాషల కూడా ప్రయోగం చేయగలగాలె. తెలంగాణలోని పదిజిల్లాలల్ల సాధారణంగా కనబడే స్వచ్ఛమైన పలుకులు, పలుకుబడులు, సామెతలు, వ్యక్తిత్వముద్రలు భాష సజీవత్వాన్ని చాటుతయి. కనుక వాటిని జనవ్యవహారంనుంచి సమీకరించి ప్రయోగించే అలవాటు చేసుకోవాలె. కోస్తా ప్రాంతానికి ధీటుగా ప్రచురణ సంస్థలు, పత్రికలు, సమాచార వాహికలు పెంచుకోవాలె. పుస్తకాలు, పత్రికలు, మీడియా, సభలు మొదలైన వాటిలో అనునిత్యం ప్రయోగించేందుకనుగుణంగా పాతకొత్త భాషా స్థితులను పరిశీలించి తెలంగాణ వ్యవహారిక భాషను తీర్చిదిద్దాలి. పాఠ్యగ్రంథాలల్లకు, విద్యాసంస్థల్లకు చదివే భాషగా తెలంగాణ భాషను ఉనికిలకు తేవటం ద్వారా విద్యార్థులకు ఇక్కడి ప్రాంతీయ భాషా సంస్కారాన్ని మనోధైర్యాన్ని ఇవ్వగలుగుతం. సంస్థాగత, కార్యాలయ, పాలనా వ్యవహారాలల్లకు తెలంగాణ భాషను వాడకంలకు తెస్తే ప్రజలకు ఎక్కువ ప్రయోజనకారి అవుతుంది.

కృషి ఒక్క రూపానికి రావాలంటే ప్రధానంగా సాహిత్యవేత్తలు, రచయితలు, పరిశోధకులు తెలంగాణ వ్యవహారిక భాష అభివృద్ధికై తమ కాలాన్ని, చూపునూ కేంద్రీకరించాలి.

*- మూసీ 'మన తెలుగు' ప్రత్యేక సంచిక, ఏప్రిల్ 2006*

# తెలుగు సాహిత్యంలో తెలంగాణావాదం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం స్వర్ణోత్సవాలు జరుపుకుంటున్న దశలోనే మరోపక్క యాభయ్యేళ్ల సహజీవనం తర్వాత ప్రత్యేకరాష్ట్ర ఆకాంక్షతో ఉద్యమిస్తున్నది తెలంగాణవాదం. అవతలి ప్రాంతం వారు దీన్ని తాత్కాలిక ప్రకంపనగా, స్వార్థపరుల సృష్టిగా, రాజకీయనాయకుల సమస్యగా తీసివేస్తున్నప్పటికీ గత దశాబ్ది కాలంగా అన్ని రంగాలలోకి ఇంకుతూ కొత్త ప్రశ్నలు లేవనెత్తుతున్నది. ఉపశ్రేణి అధ్యయనాలు పెరుగుతూ అస్తిత్వ వాదాలు స్థిరపడుతున్న సందర్భంలో తెలుగు సాహిత్యంలో తెలంగాణా వాదం విస్తరిస్తున్నది. ఉమ్మడి రాష్ట్రంలో పాటమరించిన అభివృద్ధి అసమానతలు, సాంస్కృతిక వివక్షలు ఈ వాదానికి అవసరమైన నేపథ్యాన్ని తయారుచేస్తున్నాయి.

తెలంగాణ భౌగోళికంగా ప్రత్యేకతలున్న ప్రాంతం. సాధారణంగా ఒక ప్రాంత భౌగోళిక పరిస్థితుల ప్రభావం ఆ ప్రాంత సాంఘిక జీవనం మీద, చరిత్ర సంస్కృతుల మీద విశేషంగా ఉంటుంది. చుట్టూ నెలకొని ఉన్న అడవులు, కొండలు, నదులు, ఖనిజాలు మొదలగునవి ఇక్కడి ప్రజాజీవితాన్ని ప్రత్యేకంగా మలిచాయి. చారిత్రకంగా, సాంస్కృతికంగా సంక్రమించిన ప్రత్యేకతలు ప్రత్యేక అస్తిత్వాన్ని కల్పించాయి. సుసంపన్నమై నాగరికతలు విలసిల్లిన ఈ ప్రాంతానికి తొలి నుంచి పరపీడన ఎక్కువ. నిరంతర యుద్ధాలు, తిరుగుబాట్లతో స్థానికుల జీవితం అతలాకుతలమౌతూ వచ్చింది. చారిత్రక, రాజకీయార్థిక నేపథ్యంలోంచి తెలంగాణ అస్తిత్వాన్ని విశ్లేషించటమే తెలంగాణ వాదంగా చెప్పవచ్చు. స్థానిక భావన, స్థానిక దృక్పథం, స్థానిక వ్యక్తీకరణ దీని ప్రధాన పార్శ్వాలు. తెలంగాణావాదం ఇక్కడి ప్రజల జీవనక్రమ పరిణామంతో ముడిపడి ఉన్నది.

తెలంగాణ ఉనికిని సామాజిక, తాత్వికరంగాలకు విస్తరింపజేయటంతో పాటు సాహిత్య, కళారంగాలకు అనువర్తింపజేయటం తెలంగాణవాదం తన లక్ష్యంగా భావిస్తున్నది. ఒక మరాఠీ భాషోన్మాది తెలుగులో మాట్లాడవద్దంటే తెలంగాణ 'ఆంధ్రో'ద్యమం పుట్టింది.



ఉమ్మడి రాష్ట్ర అసెంబ్లీ తెలంగాణ పేరెత్తొద్దని రూలింగ్ ఇస్తే తెలంగాణావాదం ఆవిర్భవించింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణ ప్రజలు ఎదుర్కొంటున్న చేదు అనుభవం నుంచి తెలంగాణవాదం రూపొందింది. 1948లో భారతదేశంలో విలీనమైన 'హైదరాబాద్ రాష్ట్రం' 1953లో మదరాసు నుండి విడిపోయిన 'ఆంధ్రరాష్ట్రం' కలిసిపోయి 1956లో ఆంధ్రప్రదేశ్‌గా అవతరించింది. అప్పటి నుండి ఐదుదశాబ్దాలుగా పాలకులు అవలంబిస్తూ వచ్చిన పాక్షిక విధానాల వల్ల తెలంగాణ అభివృద్ధి కుంటుపడింది. ఇచ్చిన హామీలు, రాసుకున్న ఒప్పందాలు ఉల్లంఘించబడటంతో ఇక్కడి ప్రజలు నమ్మకం కోల్పోయి తిరిగి ప్రత్యేకరాష్ట్రవాదాన్ని నిర్మిస్తున్నారు.

విద్యావకాశాలు మెరుగుపర్చకపోవటం, స్థానిక ఉద్యోగాల్లో స్థానికేతరులనియామకం, స్థానికులకు ఉపాధి కల్పించే అనేక పరిశ్రమలు మూసివేయటం, వ్యవసాయరంగ అభివృద్ధిలో తీవ్ర వివక్ష ముఖ్యంగా గోదావరి, కృష్ణానది నీటి అక్రమ తరలింపు, లోవోల్టేజీ, కోతల కరెంటు సరఫరా, వ్యవసాయ భూముల అడ్డగోలు అమ్మకం, రియలెస్టేట్‌లు, వాణిజ్యపంటలు, అప్పులూ వసూళ్లు అన్నిటికి మించి రాజకీయ, పాలనాధికారాల్లో ప్రాతినిధ్యం లేకుండా చేయటం, బొగ్గు, కలపలాంటి స్థానిక వనరుల తరలింపు, ముల్కీలాంటి ప్రత్యేక రక్షణలు ఉల్లంఘించటం, భాషా సాహిత్య కళారంగాల్లో వివక్ష ప్రదర్శించటం మొదలైన అంశాలు తెలంగాణావాదానికి దారితీసినాయి. వలసవాదులు తెలంగాణను ఆక్రమిత ప్రాంతంగా భావించారే తప్ప సమదృష్టి ప్రదర్శించలేదని తెలంగాణవాదం భావిస్తున్నది. ఆర్థిక దోపిడీకి, సాంఘిక వివక్షకు గురయి తట్టుకోలేని తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కోరుకుంటున్నది.

తెలంగాణవాద దృక్పథంతో తెలుగు సాహిత్యాన్ని విశ్లేషించి వివక్షను నిర్ధారిస్తున్నారు. సమైక్యరాష్ట్రంలో తెలంగాణ అస్తిత్వం కోల్పోయినట్లే తెలుగు సాహిత్య చరిత్రలో తెలంగాణ సాహిత్యం అస్తిత్వం కోల్పోయింది. తెలంగాణ సాహిత్య సందర్భాలకు ఆంధ్రసాహిత్య చరిత్రలో సముచితస్థానం లభించలేదు. రచనలోని పాక్షిక దృష్టి వల్ల కొందరు రచయితలు విస్మృతికి లోనుకాగా, కొందరు నామమాత్ర ప్రస్తావనకు గురయినారు. వేర్వేరు సాంఘిక జీవితాలలో కొనసాగటంవల్ల వేర్వేరు సాహిత్యధోరణులు వెల్లడైనాయి. ఆంధ్రప్రాంతంలో ప్రధానంగా బౌద్ధ, వైష్ణవమత సాహిత్యాలు విస్తరిల్లగా, తెలంగాణలో జైన, శైవమత సాహిత్యాలు విస్తరిల్లినాయి. కోస్తాలో 'మార్గ' సంప్రదాయంలో కవిత్వం వస్తే తెలంగాణలో

'దేశి' సంప్రదాయంలో కవిత్వం వచ్చింది. సంస్కృతం, తమిళం కలిసిన తెలుగు ఒక ప్రాంతానిదైతే, కన్నడం, ఉర్దూ కలిసిన తెలుగు ఒక ప్రాంతానిది. తెలంగాణ కవులయి నందుకే పాలకురికి సోమన, వేములవాడ భీమకవి, కొఱవి గోపరాజు లాంటి కవులకు సరైన ప్రాధాన్యత ఇవ్వలేదు. పోతన వంటి కవులకు సముచిత స్థానం ఇవ్వవలసివస్తే అతను తమ ప్రాంతం వాడేనని తెలంగాణేతరులు కొందరు ఇప్పటికీ వాదిస్తారు. ఆధిపత్య, వివక్షపూరిత వైఖరితో తెలుగు సాహిత్య చరిత్ర రచించటం వల్ల తెలంగాణ ప్రాంత సాహిత్యానికి తీరని నష్టం జరిగింది.

బ్రిటిష్ పాలనలోని ఆంధ్రలో, నిజాం పాలనలోని తెలంగాణలో ఒకే రకమైన సాంఘిక పరిణామక్రమం చోటుచేసుకోలేదు. వలసలు, సముద్ర వ్యాపారం, కాలువ వ్యవసాయం, ఆంగ్లవిద్య అభివృద్ధిక్రమం సంభవించి ఆంధ్రలో భావ, సంస్కరణ, అభ్యుదయ కవిత్వ పరిణామాలకు దారితీసింది. అవేవీ ఇక్కడ చోటుచేసుకోలేదు. తెలంగాణలో సంప్రదాయక వ్యవసాయం, వెట్టి, విద్యలేమి, భూస్వామ్య పీడన ఆ వికాసం సోకనివ్వలేదు. సంఘాలు, ప్రజాపోరాటాలు జరిగి అభ్యుదయసాహిత్యం వచ్చినా సంప్రదాయక, జానపద రూపాల్లో వచ్చింది. ఆధునిక, శిల్ప,సాహిత్య ప్రమాణాలు ఇముడ్చుకోక పోవటం వల్ల విమర్శకులు పట్టించుకోలేదు. వెనుకబడిన సమాజాల్లో ఆధునికత పేరిట, అభివృద్ధి పేరిట అణచివేతే సాగుతుంది. ఆంధ్రలోవలె వ్యావహారిక భాషా ఉద్యమాలు తెలంగాణలో సాగకపోవటం వల్ల ఎంత సాహిత్యం సృష్టి చేసినా అటు శిల్పంలో, ఇటు భాషలో ఆధునికత సంతరించుకోకపోవటం వల్ల ఇక్కడి రచయితలు గుర్తింపుకు నోచుకోలేదు. పైగా - రెండు ప్రాంతాలు కలవకముందే ముడుంబై వేంకట రాఘవాచార్యులు 'నిజామాంధ్రలో కవులు పూజ్యము' అని అవహేళన చేసినాడు. సురవరం ప్రతాపరెడ్డి కోపించి 354 మంది తెలంగాణ కవుల రచనలతో "గోలకొండ కవుల సంచిక" ప్రకటించవలసి వచ్చింది. "సాహిత్య రచనకు బజారుభాష పనికిరాదు" అని తెలంగాణభాషను ఉద్దేశించి తనికెళ్ళవారు చేసిన వ్యాఖ్య, "స్థానిక యువకులకు ఉత్సాహమేగాని రచనా శిల్పం తెలియదు" అని వేలూరి వారు చేసిన విసురు తెలంగాణ సాహిత్యకారుల మనోభావాలను దెబ్బతీసాయి. అయినా 'భాష' ఒక్కటనే భావనతో ఒక రాష్ట్రం ఏర్పడింది. 'మహాంధ్రోదయం' రాసి తన హర్షాన్ని ప్రకటించిన 'దాశరథి'కి ఈసడింపులు తప్పలేదు. భౌగోళికంగా ఒకటి అయినప్పటికీ భావస్పందనలు ఒకటి కాలేకపోయాయి. మానసిక ప్రపంచాలు కలపలేకపోయారు. 'మూడు కోటుల నొక్కటే ముడిబిగించి కలిసిపోగోరుచున్నదీ తెలుగునేల' అని పరవశించిన దాశరథి కొద్దిరోజులకే 'కమ్మని నా తెలంగాణ తొమ్మిది జిల్లాలేనా, సకలాంధ్రకు తెలంగాణ పర్యాయపదం కాదా?' అని ఆక్రోశించాడు. విశ్వనాథను పి.వి. నరసింహారావు ప్రేమించినట్లు ఆస్థానకవిగా దాశరథిని ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు ప్రేమించకపోయినా కనీసం అంగీకరించలేక పోయాడు. ఆనాటి పండితులేకాదు, ఈనాటి ఆధునికులు అదే ధోరణి ప్రదర్శించటం యాదృచ్ఛికం కాకపోవచ్చు.

తెలంగాణ తొలి నుండి ఎదుర్కొంటున్న అవహేళనల్లో 'భాష' కీలకమైనది. తెలంగాణ భాష సాహిత్య రచనకు యోగ్యమైంది కాదని స్థానికేతరుల అభిమతం. కోస్తా భాష నాగరికమైన, నాజూకయిన భాష అని, తెలంగాణ భాష మోటుభాష అనీ చాలామంది భావిస్తారు. తరచుగా జరిగే ప్రచారానికి తలొగ్గి తెలంగాణ వాళ్లు కూడా అట్లా భావించే స్థితికొచ్చారు. దానికి తోడు తెలంగాణ భాషను మాండలిక భాషగా వ్యవహరించి దాని స్థాయిని కుదింపజేస్తారు. తెలంగాణ భాషలో రచన చేయాలని శ్రీశ్రీ ఆహ్వానిస్తే కొడవటిగంటి కుటుంబరావు వ్యతిరేకించాడు. 'ప్రజాసాహితి' ప్రామాణిక భాష గురించి, అందరికి అర్థమయ్యే భాష గురించి చర్చచేసింది. చిన్నయసూరి 'లక్షణ విరుద్ధంబగు భాష'గా పేర్కొన్న కోస్తాభాష 'వస్తాడు', 'తెస్తాడు' ఎట్లాఎప్పుడు ప్రామాణిక భాషయిందో తెలంగాణావాదం గుర్తించింది. వాడుక భాషా ఉద్యమాన్ని ఎవరు అనుగుణంగా వినియోగించుకున్నారో స్పష్టమయింది. రాజ్యాధికారం, సంపద, ఉద్యమం, సాహిత్యం నాలుగు కోణాలు 'ప్రామాణిక భాష' గౌరవాన్ని కలిగిస్తాయి గనుక తెలంగాణ భాష అటువైపు కృషి చేస్తున్నది. విస్తృతంగా తెలంగాణ భాషలో రచనలు చేయటం, ఉన్నతిని నిరూపిస్తూ చర్చచేయటం తెలంగాణ వాదం లక్ష్యంగా పెట్టుకొన్నది. నలిమెల భాస్కర్ 'తెలంగాణ పదకోశం' రూపొందించాడు. పత్రికలు, సినిమాలు, ప్రసారసాధనాలు తెలంగాణ భాషను వక్రీకరించుతున్న తీరును తెలంగాణవాదం తీవ్రంగా వ్యతిరేకిస్తున్నది.

సహజ భాషలోనే స్థానిక మట్టిపరిమళం ఉంటుంది. రచనలో కృత్రిమ భాషను ప్రవేశపెడితే సృజనాత్మక శక్తి బలహీనపడుతుంది. వలసవాదులు చేసిన న్యూనతా ప్రచారం వల్ల తెలంగాణ రచయిత ఆంధ్రభాషను అనుకరించి 'రెంటికి చెడి'నాడు. ఇక్కడి సాహిత్యం స్థానిక జీవితం నుంచి వేరయి సహజశక్తులు కోల్పోయి పరాయి భాషనేకాదు పరాయి జీవితభారాన్ని మోసింది. ఆ స్థితి నుంచి తెలంగాణ రచయితల్ని కాపాడుకునేందుకు తెలంగాణ వాదం కృషిచేస్తున్నది.

తెలుగు సాహిత్యం నుంచి తెలంగాణ సాహిత్యాన్ని వెలిగా ఉంచే సాధనాలు రచనా ప్రమాణాలు, వలసాధిపతులు తెలంగాణ వారిని పాఠకులుగానో, తమ అభిమానులుగానో సాహిత్య ప్రచారకులుగానో చూడదలిచారు తప్ప రచయితలుగా స్వీకరించలేదు. వలసవాద ప్రచురణ సంస్థలు తెలంగాణవారిని పుస్తక కొనుగోలుదార్లుగానే చూశారు. స్థానిక రచయితల పుస్తకాలు ప్రచురించలేదు. వారు సంపాదకులుగాఉన్న "నేషనల్ బుక్ ట్రస్ట్", "కేంద్రసాహిత్య అకాడమీ" సంస్థల సంకలనాల్లో ఇతర ప్రచురణ సంస్థల కవితా, కథా సంకలనాల్లో తెలంగాణ రచయితలకు స్థానం కల్పించలేదు. కారణమేమంటే శిల్పప్రమాణాలతో రచించటం తెలంగాణ రచయితలకు చేతకాదని వాదించారు. రచనా ప్రమాణాలు సాపేక్షమేనని స్థలకాలాల్నిబట్టి నేపథ్యాన్నిబట్టి అవి మారుతుంటాయని తెలంగాణ వాదం స్పష్టంచేసింది. ప్రాంత నేపథ్యం లోంచే ప్రమాణాలు నిర్ధారించాలని వాదిస్తున్నది. తెలుగుసాహిత్యంలో స్థిరపర్చబడిన ప్రమాణాలు, శిల్పపరిభాషను సంస్కరించి స్థానిక జీవన విలువల్ని ప్రతిష్టించటానికి ప్రయత్నిస్తున్నది. ఈ దృష్టికోణం నుంచి గత సాహిత్యాన్ని వర్తమాన సాహిత్యాన్ని విశ్లేషించి పునర్మూల్యాంకనం చేయతలపెట్టింది.

చరిత్రను వెలికితీసి సమున్నతంగా ప్రదర్శించటం, వివక్షను గుర్తింపజేసి సవరించటం, స్థానిక సాహిత్యాన్ని సమాంతరంగా ఋజువు చేయడం, కాలసందర్భానికి అనుగుణంగా కొత్త సాహిత్యాన్ని సృష్టించటం తెలంగాణవాదం ముందున్న కర్తవ్యాలు.

కనుమరుగయిన చరిత్రను తవ్వితీసి ధీటుగా చూపటంలో భాగంగా ముదిగంటి సుజాతారెడ్డి 'తెలంగాణ తొలి తరం కథలు' వెలువరించారు. సంగిశెట్టి శ్రీనివాస్, ముదిగంటి సుజాతారెడ్డి సంయుక్తంగా 'తొలినాటి తెలంగాణ కతలు' ప్రచురించారు. 1970 వరకు తెలంగాణలో కథ రాలేదని కేతు విశ్వనాథరెడ్డిచేసిన వ్యాఖ్యకు సమాధానంగా సంగిశెట్టి శ్రీనివాస్ తెలంగాణ కథల జాబితా 'దస్త్రమ్'ప్రచురించాడు. విశాలాంధ్ర ప్రచురణాలయం వారు 'తెలంగాణ కథ' ప్రచురించటం విశేషం. స్థానిక వర్తమాన సాహిత్యాన్ని సమాంతరంగా ప్రదర్శించే పనికూడా సాగుతున్నది. ప్రతియేటా తెలంగాణ నుంచి వెలువడే ఉత్తమ కథలతో తెలంగాణ కథ (2003), (2004), (2005) సంపుటాలు కర్ర ఎల్లారెడ్డి ప్రచురించాడు. కరీంనగర్‌జిల్లా కథలు బి.యస్.రాములు ప్రత్యేకంగా ప్రచురించాడు.

విస్మరణకు గురయిన వట్టికోట ఆళ్వారుస్వామి జీవితచరిత్ర వేణుగోపాల్, సంగిశెట్టి శ్రీనివాస్ సంయుక్త రచనగా 'సార్థక జీవితం' ప్రచురించారు. వట్టికోట రచించిన 'ప్రజల మనిషి' 'గంగు' నవలల్లో తెలంగాణ సాంఘిక జీవితం చిత్రితమైనప్పటికీ తెలుగు సాహిత్య



చరిత్ర పెద్దగా పట్టించుకోలేదు. వట్టికోట సాహిత్య జీవితాన్ని ఉద్యమజీవితాన్ని 'సార్థక జీవితం' వర్ణించింది. తెలంగాణవాదం కవిత్వ రంగంలో ప్రబలంగా ప్రతిబింబిస్తున్నది. జూలూరు గౌరీశంకర్ సంపాదకత్వంలో 'పొక్కిలి', సుంకిరెడ్డి నారాయణరెడ్డి సంపాదకత్వంలో 'మత్తడి' సంకలనాలు వెలువడి తెలంగాణ కవుల ప్రతిస్పందనలను చాటుతున్నాయి. జిల్లాల్లో నెలకొని ఉన్న ప్రత్యేక పరిస్థితుల్ని ప్రతిబింబించే సంకలనాలు వచ్చాయి. పాలమూరు కరువు నేపథ్యంలో 'పాలమూరుగోస', 'పాలమూరు కవిత' వెలువడినాయి. మెదక్‌జిల్లా స్థానికతా చిత్రణతో మంజీరా కవులు 'ఎడపాయలు' ప్రచురించారు. తెలంగాణ సుదీర్ఘవేదనను చిత్రించేందుకు దీర్ఘ కవితలు / కావ్యాలు అనివార్యమౌతున్నాయి. జూలూరు గౌరీశంకర్ 'నా తెలంగాణ', శిరసు 'నల్ల వలస', అల్లం నారాయణ 'యాది మనాది', సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'దాలి', ఎం. వెంకట్ 'వర్జి' వెలువడినాయి.

తెలంగాణ భాషకు కావ్యగౌరవం కలిగించే దిశగా ప్రత్యేకమైన కృషి జరిగింది. దేవరాజు మహారాజు 'గుడిసె గుండె', పంచరెడ్డి లక్ష్మణ 'ఇసిత్రం', భాను 'ఊరోల్లు', కృష్ణమూర్తి యాదవ్ 'తొక్కుడు బండ', మోతుకూరి అశోక్‌కుమార్ 'కొల్పులోల్లం', ఎన్.గోపి 'పల్లెల్లో మా పల్లెల్లో' పూర్తి తెలంగాణ భాషలో మంచి నుడికారంతో రచింపబడినాయి. ఇవి గతంలోనే వెలువడినప్పటికీ తెలుగు సాహిత్యం పట్టించుకోకపోవటం వల్ల తిరిగి దృష్టికి తెచ్చే ప్రయత్నం తెలంగాణ వాదులు చేస్తున్నారు. ఈమధ్య పుస్తక శీర్షికలుగా తెలంగాణ ప్రతీకల్ని నిర్ణయించటం సందర్భం తెచ్చిన పరిణామం. 'పాతాళ గరిగె', 'గంగడోలు', 'ఒక బాధ గాదు', 'గోగుపువ్వు', 'పాలపిట్ట', 'గాయి', 'తొవ్వ', 'మంకమ్మ తోట అడ్డా', 'పునాస', 'గోరుకొయ్యలు', 'వరద గూడు', 'ఎన', 'మొగి', 'యేశకాంత', 'ఎర్కోషి', మొదలైన కవితా సంపుటాలు పేర్లు ప్రాంత పరిమళాన్ని ప్రకటిస్తున్నాయి. ఇటీవల రాష్ట్రమంతటికీ ప్రాతినిధ్యం వహించే తెలుగు కవితా వార్షిక సంకలనాలు 2004, 2005 వరంగల్ కేంద్రంగా వెలువడటం కూడా తెలంగాణ ప్రాంతీయ చైతన్యం తెచ్చిన పరిణామానికి చిహ్నంగా భావించవచ్చు. తెలంగాణ ఉద్యమం లేవనెత్తుతున్న అన్ని అంశాల్ని తెలంగాణ కవిత్వం ప్రతిధ్వనిస్తున్నది.

"జగన్నాథ రథచక్రాలు మా నేలమీద దిగనే లేదు
భగీరథాలు మా నదుల్ని దారిమళ్లించాయి
తెలుగుతల్లి తన కలశాన్ని మా నేలమీద ఒంపనే లేదు
ఓ నీటి పారుదలా నీ రస్తా కోస్తాకే

*నిజం దేవుడెరుగు నీరు కోస్తానెరుగు*
*పల్లం ఒక నెపం మాత్రమే"*

అని జలపంపకంలో జరిగిన అన్యాయాన్ని కవిత్వం నిలదీస్తున్నది.

తెలంగాణ కవిత్వంలో ప్రాధాన్యభాగమైన 'పాట' తెలుగు సాహిత్యంలో కనీస చర్చకయినా నోచుకోలేదు. పదకవితా ప్రస్థానంలో కీర్తనల్ని చర్చించారు. జాతీయ గీతాల్ని ప్రస్తావించనైనా ప్రస్తావించారు. తెలంగాణ సామాజిక గీతాల్ని పట్టించుకోలేదు. తెలంగాణకు సంబంధించినంతవరకు 'పాట' ప్రత్యేకం. మరే ప్రాంతంలోనూ వెలువడనంత 'పాట' సాహిత్యం ఇక్కడ వెలువడింది. సుద్దాల హన్మంతు, గద్దర్, గూడ అంజయ్య, గోరటి ఎంకన్న, అందెశ్రీ, సుద్దాల అశోక్ వంటి ప్రఖ్యాత కవిగాయకులు ప్రభవించారు. మంజీరా కవుల 'తెలంగానం', అరుణోదయ 'తెలంగానం', ప్రజాకళామండలి 'నా తెలంగాణ', సహచర 'తెలంగాణ తల్లి' పాటల పుస్తకాలు, వందల కొద్దీ క్యాసెట్లు వెలువడి తెలంగాణ చైతన్యాన్ని ప్రేరేపిస్తున్నాయి.

తెలంగాణ విమర్శ వివిధ కోణాల్లో సాగుతున్నది. చారిత్రక విశ్లేషణలో 'సంగన భట్ల నర్సయ్య', విస్మృత చరిత్రను వెలికితీయడంలో 'సంగిశెట్టి', మూల్యాంకనం చేయటంలో 'కె. శ్రీనివాస్', వర్తమాన రచయితల్ని పరామర్శించటంలో 'గుడిపాటి' ప్రత్యేక శ్రద్ధను ప్రదర్శిస్తున్నారు. గుడిపాటి 'ఫాయిదా', సుజాతారెడ్డి సంకలనం చేసిన 'ముద్ర' పేర్కొనదగిన విమర్శగ్రంథాలు.

యాభై సంవత్సరాల సహజీవనం మానసిక భావైక్యతను సాధించలేక పోయింది. "భాష" "తల్లి" వంటి ఆదర్శాల వట్టి మాటలు ఐక్యతను నెలకొల్పలేవని బుజువయింది. భౌతిక లాభంతో అంటకాగని సాంస్కృతిక సాహిత్యరంగాల్లో కూడా 'కలయిక' నెలకొనలేదు. 'ఏటుమటం'గా మారిన స్థితిగతుల్ని తెలంగాణ వాదం ఎత్తిచూపుతుంది. ఇప్పటి సాహిత్య చట్రం నుంచి భావబంధం నుంచి ఊపిరి పీల్చుకోవటానికి తెలంగాణ సాహిత్యం ప్రణాళికా బద్ధంగా కృషి చేస్తున్నది.

*- తెలుగు పసిడి, అక్టోబర్ 2006*



# గత దశాబ్దిలో ప్రాంతీయ సాహిత్యం-తెలంగాణ

**వ**ర్తమాన సామాజిక సందర్భాన్ని ప్రాంతీయత బలంగా కుదిపివేస్తున్నది. ఇదొక చారిత్రక దశ. ఏదశలోని సమాజాన్నయినా లోతుగ అధ్యయనం చేయదల్చుకున్నప్పుడు సంపూర్ణవాస్తవికతను ఆవిష్కరించదలచుకున్నప్పుడు దాని అన్ని కోణాల్ని పరిశీలించాల్సి ఉంటది. వర్గం, కులం, జెండర్, మతం, మొదలయిన విశ్లేషణలు కొత్తపార్శ్వాల్ని ఆవిష్కరించినట్టే ప్రాంతీయ విశ్లేషణ కొత్త సత్యాల్ని నిరూపిస్తున్నది. సార్వకాలిక, సార్వజనీన భావనలన్నీ కేవలం ఆదర్శాలుగా మిగిలి కొత్త విశ్లేషణల గాలికి తుడిచిపెట్టుక పోతున్నాయి. వర్తమాన ఆలోచనా రూపం మీద ఎవరూ కాదనలేని దృష్టికోణంగా ప్రాంతీయతావాదం ప్రాధాన్యతను సంతరించుకున్నది. ప్రపంచమంతా ఒకే భాష ఒకేసంస్కృతి ఒక ఆలోచనా స్రవంతిగా మార్చివేయాలని దూసుకొస్తున్న ప్రపంచీకరణ సందర్భంలో భిన్న సమూహాలు భిన్న సంస్కృతులు అస్తిత్వ అన్వేషణలో భాగంగా పునర్నిర్మాణమవుతున్నాయి.

సృజనాత్మక సాహిత్యంలో 'ప్రాంతీయత' కొత్త ప్రయోగమేమీ కాదు. 'జననీ జన్మ భూమి" నుండి 'Native Land,' 'Mother Land' ల నుండి Time and Space దాకా సాగిన సుదీర్ఘ ప్రయాణంలో 'ప్రదేశం' లేదా 'ప్రాంతం' ప్రధాన భావనగా కొన్ని సందర్భాల్లో ప్రధాన విలువగా రాణించింది.

ప్రాదేశికత, స్థానికత, ప్రాంతీయత లాంటి మాటలు వాడుకలో ఉన్నప్పటికీ 'ప్రాంతీయత' అనే మాట ఎక్కువ ప్రయోగంలో ఉన్నది. 'ప్రాంతీయత' సాపేక్షం. నింద్యార్థంలో సంకుచితార్థంలో అక్కడక్కడా వాడుక ఉన్నప్పటికీ ఉద్దేశ్యపూర్వక వ్యవహారదోషమే తప్ప శబ్దదోషం కాదు. అభిమానాలు సందర్భాన్ని బట్టి రూపొంది స్థిరపడుతూ ఉంటాయి. భాష, జాతి, ప్రాంతం, కులం, మతం, ఎన్నో విధాలుగా అభిమానాలు ఏర్పడే అవకాశమున్నది. ఇవన్నీ బలమైన నిర్మాణాలు. చాలా ప్రజాస్వామికంగా ఆలోచించే మేధావులు, ప్రగతి వాదులు 'ప్రాంతీయత' 'ప్రాంతీయ వాదం' దగ్గరకు రాగానే వ్యతిరేక స్వభావాన్ని కలిగి ఉండటం యాదృచ్ఛికమేమీకాదు. తరచి చూస్తే స్వప్రయోజన కారక కారణాలే ఉంటాయి.

ప్రాంతమంటే స్థూలార్థంలో భౌగోళికంగా ఒక నిర్దేశిత భాగం. లోతుకి వెళ్లితే రాజకీయంగా ఒక పాలనా విభాగం. ఆర్థికంగా ఒక ఉత్పత్తి విధానం కలిగిన జీవితం. ఒక ప్రాంత నిర్వచనానికి ఇవన్నీ ప్రాతిపదికలుగా ఉంటాయి. ఎప్పుడో యాంత్రికంగా చేసిన నిర్వచనం కాకుండా ఈ ప్రాతిపదికలనుంచే 'జాతి'ని పునర్నిర్వచించుకోవాల్సి వస్తది. కాలమేదైనా ప్రాంతీయాభిమానాన్ని ప్రదర్శించని కవీ రచయితా లేకపోవచ్చు. కానీ ప్రాంతీయ స్పృహ కలిగి ఉండటం వేరు. దేశకాలాల స్పృహే 'ప్రాంతీయ స్పృహ' (వల్లంపాటి). తమ అధీనతాస్థితికి సంబంధించిన స్పృహ (కాత్యాయని విద్మహే). అన్ని ఆచరణల్లోనూ, కార్యరంగాల్లోనూ ప్రాంతస్పృహ పెంపొందించుకోవటం 'ప్రాంతీయ వాదం'. ప్రాంతీయ అభివ్యక్తి, ప్రాంతీయ దృష్టి ప్రాంతీయవాద లక్షణాలు (కె.శ్రీనివాస్) గా గుర్తించవచ్చు.

ప్రాంతీయ ముద్ర అంటందే ఒక కళారూపానికి జీవం రాదు. జీవితాన్ని చిత్రించదలచుకున్నప్పుడు, ప్రజల కష్టసుఖాలు నిజాయితీగా వ్యక్తీకరించదల్చుకున్నప్పుడు, పెల్లుబుకుతున్న ప్రాంతీయతా భావనల ప్రమేయం లేకుండా సాధ్యం కాదు.

ప్రపంచ సాహిత్యమంతటా వీస్తున్న కొత్తదనాల, అధ్యయనాల పూర్వరంగం కూడా తోడుంది. విస్మృతాంశాల్ని, వినిర్మాణాల్ని విశ్లేషించిన ఉత్తరాధునిక వాదం (Post Modernism) ఉపశ్రేణుల అస్తిత్వ అన్వేషణను సూత్రీకరించిన అధీన సమూహాల అధ్యయనాలు (Subaltern Studies) పరాయీకరణ పూర్వాపరాల్ని, వలసాధిపత్యాన్ని వింగడించిన ఉత్తరవలసవాదం (Post Colonialism) లాంటి కొత్త విశ్లేషణలెన్నో జరిగినయి. చారిత్రకంగా అనివార్యమైన పరిస్థితులు, అంతర్గత వలసలు, ఆర్థిక అభివృద్ధి అసమానతలు, సోషలిస్టు రాజ్యాల పతనం తర్వాత తాత్వికంగా చెలరేగిన నూతన ధోరణులు మరోసారి ప్రాంతీయవాదాన్ని ముందుకు తెచ్చినయి. ప్రపంచ వ్యాప్తంగా ప్రాంతం, ప్రాంతీయత, జాతి, జాతీయత అన్న అంశాలు కొత్త భావనలతో ఆకాంక్షలతో ముందుకొచ్చినయి. చరిత్రను కొత్తగా విశ్లేషించినయి.

తెలుగు రాష్ట్ర అవతరణే కృతకమైంది. దోస్తీకంటే దోపిడి భావనతో కూడుకొన్నది. ఆత్మీయతకంటే అధికార దాహంతో నిండి ఉన్నది. రాయలసీమ పూర్తి అసమ్మతిని, అయిష్టతను ప్రకటించింది. 'శ్రీభాగ్ ఒడంబడిక' (1937) ద్వారా దాన్ని జయించారు. విలీనానికి తెలంగాణ ప్రాణత్యాగాలతో అసమ్మతిని తెలిపింది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిటి ఫజల్ అలీ కమిషన్ అధికార నివేదికలో 'విశాలాంధ్ర'ను వ్యతిరేకించింది. ఒక దశలో అప్పటి భారత ప్రధాని నెహ్రూ వ్యతిరేకించాడు. ఈ అసమ్మతిని 'పెద్దమనుషుల ఒప్పందం' (1956)తో జయించారు. బలవంతంగా ఒక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడం జరిగిపోయింది.



అభివృద్ధి వెలుగులతో కోస్తాంధ్ర మిరుమిట్లు గొలుపుతుంటే వెలుగుకింది నీడల్లో రాయలసీమ, తెలంగాణ దీనంగా కృశించిపోతున్నాయి. చివరకు చూస్తే ఉత్తరాంధ్ర కూడా ఫలం చేజారి పరితపిస్తున్నది.

తెలుగు సాహిత్య రంగంలో తెరతీసిన ప్రాంతీయ వాదాల్లో 'తెలంగాణ వాదం' ప్రబలమైంది. తెలంగాణ ప్రజల ఆత్మగౌరవ పోరాటంగా, హక్కుల ఉద్యమంగా, అస్తిత్వ అన్వేషణగా ముందుకు వచ్చింది తెలంగాణ వాదం. నలభై ఆరేండ్ల సమైక్య జీవనంలో ఎదురైన దోపిడి, దగా, అవమానాల మధ్యనుంచి గొంతెత్తి ప్రత్యేక రాష్ట్రాన్ని డిమాండ్ చేస్తున్నది. చరిత్రలో ప్రత్యేకించి సాహిత్య చరిత్ర రచనలో జరిగిన వివక్షక్రమాన్ని విశ్లేషిస్తూ తెలంగాణ సాహిత్య చరిత్రను పునర్లిఖించుకుంటున్నది.

తెలంగాణ ప్రజల జీవనోపాధితో ముడిపడివుంది తెలంగాణవాదం. ప్రజల ఆవేశాలతో, అవసరాలతో, అనుభవాలతో పెనవేసుకొని రూపొందింది. తొమ్మిదో దశకంలో బలంగా పెల్లుబికినప్పటికీ ప్రాంతీయ వాదానికి చరిత్రలో బలమైన ప్రాతిపదికలు ఉన్నాయి. ఉమ్మడి రాష్ట్రం ఏర్పడక ముందే విశాలాంధ్ర ప్రతిపాదన దశలోనే ఈ ప్రాంత ప్రజలకు చేదు అనుభవాలు ఎదురైనాయి. 1948 తర్వాత 'వెల్లోడి' ప్రభుత్వ హయాంలో జరిగిన ఉద్యోగ నియామకాలు ఇక్కడి విద్యావంతుల్ని తీవ్ర అసంతృప్తికి గురిచేసినయి. కాలువ ఆయకట్టు భూముల్ని వశపర్చుకున్న తీరు బాధపెట్టింది. తెలంగాణలో కవులే లేరని ముడుంబై వెంకటరాఘవాచార్యులు లాంటి పండితులు చేసిన వ్యాఖ్య సాంస్కృతిక రంగ వివక్షకు గుర్తుగా మిగిలివున్నది.

1956 నవంబర్ 1 ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ తర్వాత 'పెద్దమనుషుల ఒప్పందం' పేరుకే మిగిలింది. ఉపముఖ్యమంత్రి పదవిని ఆరోవేలుగా ఈసడించుకున్నప్పుడే రాజకీయ అణచివేత మొదలైంది. నాగార్జునసాగర్ ఎడమకాలవ ప్రాంతం ఎత్తున ఉందిగనుక నీళ్లు ఎక్కవని మాట్లాడినప్పుడే అభివృద్ధి అసమానత పొడచూపింది. అయిన ఉద్యోగాలన్నీ అయినవాళ్ళకు కట్టబెట్టినప్పుడు పాలకుల వివక్ష ప్రత్యక్షమైంది. అనేక దోఖాలకు నిరసనగా 1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ప్రజ్వరిల్లింది. 360 మంది బలిదానాలు వక్రీకరింపబడ్డాయి. ఆంధ్రుల ఆత్మగౌరవం నినాదంతో ముఖ్యమంత్రి అయిన ఎన్టీరామారావు "ప్రాంతీయ అభివృద్ధి బోర్డు" మొత్తంగా రద్దుచేశాడు. హైద్రాబాద్ రియల్ ఎస్టేట్ 'కాలనీ' అయింది. ఈ శతాబ్దపు చివరి దశాబ్దం ఆరంభమే మళ్లీ తెలంగాణ ఉద్యమంతో మొదలైంది.

తెలంగాణ అనే పదం కూడా అసెంబ్లీలో ఉచ్చరించటానికి వీల్లేదన్న రూలింగ్ తీవ్ర చర్చకు దారితీసింది. అణిచివేత పరాకాష్టకు చేరిందన్న విషయం ఈ ప్రాంతం గుర్తించింది. ఈ చర్చలు 'తెలంగాణ వాదాని'కి రూపకల్పన చేసినయి. గత ఐదేళ్ళుగా రాజకీయ రంగం నుండి సాంస్కృతిక రంగానికి విస్తరించి తెలంగాణ వాదం రాణిస్తున్నది. ఇది చర్చకు తెస్తున్న అంశాలు ఇక్కడి ప్రజల జీవన్మరణ సమస్యలుగా అర్థం చేసుకొంటే తప్ప వాద విస్తృతి, లోతు ఎరుకపడదు.

తెలంగాణది అస్తిత్వ అన్వేషణలోంచి మొలకెత్తిన హక్కుల పోరాటం. కింది అంశాల్ని ఇది ముందుకు తెచ్చింది. అంతర్గత వలస పెత్తనంగా మారి స్థానికుల మీద ఆధిపత్యం చేస్తున్నది. ఉమ్మడి రాష్ట్రంలో నీళ్లు, బొగ్గు, విద్యుత్తు మొదలైన స్థానిక వనరుల దోపిడి విచ్చలవిడిగా కొనసాగుతున్నది. ఒక భాష సెంటిమెంటు కోసం విద్య, ఉద్యోగ రంగాల్లో వివక్షలవల్ల జీవనోపాధి కోల్పోవలసి వచ్చింది. రాజకీయ పాలనా వ్యవస్థల్లో తగిన ప్రాతినిధ్యం లేకపోవడం వల్ల అభివృద్ధి సమంగా జరగలేదు. భూములు కోల్పోయి, స్థానిక వ్యవసాయం దెబ్బతిని రైతులు ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. కోస్తా మిగులు పెట్టుబడుల ప్రవేశంతో చేతివృత్తులు దెబ్బతిన్నాయి. సినిమా, పత్రికా, ప్రసారసాధనాల ఏకఛత్రాధిపత్యం వల్ల స్థానిక భాషా సంస్కృతులు మొత్తంగా అణిచివేయబడ్డాయి. పైగా పరాయీకరణకు లోనయి జీవరహితమైనాయి. తెలంగాణ భాష వెక్కిరింతలతోపాటు విలన్ల, రౌడీల భాషగా వక్రీకరింపబడ్డది. ప్రధాన స్రవంతి తెలుగుసాహిత్య చరిత్రలో ఇక్కడి కవుల, రచయితల ప్రాధాన్యత తగ్గించి వెలివేశారు. తెలంగాణవాదం చారిత్రకాంశాలు విశ్లేషించి కింది అవగాహనను ముందుకు తెచ్చింది.

ఉమ్మడి రాష్ట్రంగా ఏర్పడే నాటికి ఇవి రెండు రాష్ట్రాలు. రెండు వేర్వేరు యూనిట్లు. వేర్వేరు పాలనా వ్యవస్థలున్న ప్రాంతాలు. ఆర్థిక, సాంస్కృతిక జీవనం వేరుగా ఉన్నది. కనుక ఇవి రెండు వేర్వేరు జాతులు. జాతిని నిర్వచించటానికి భాష ఒక్కటే సరిపోదు. వాస్తవంగా ఆంధ్రము, తెలుగు రెండు వేర్వేరు భాషలు. తెలంగాణ భాష మాండలిక భేదం కాదు. ప్రత్యేకమైన భాష. తెలంగాణ అనేక సంస్కృతుల, జీవనాల కూడలి. ప్రాంతీయ ఆర్థిక వ్యత్యాసాలు ప్రణాళికలు రాసేటప్పుడు పరిగణనలోకి తీసుకోలేదు. సాంస్కృతిక వ్యత్యాసాల్ని పట్టించుకోలేదు. వీటన్నిటిని అర్థం చేసుకోవటానికి ప్రాంతీయ దృష్టి చాలా ముఖ్యమైంది. ప్రాంతీయ దృష్టితో సమస్యలు విశ్లేషించటం ద్వారానే ప్రాంతీయాభివృద్ధి సాధ్యమవుతుంది. ప్రాంతం అభివృద్ధి చెందనిదే ప్రాంతీయ అసమానతలు తొలగిపోవు. ప్రాంతీయ అభివ్యక్తులతో, ప్రాంతీయ కోణంతో సాహిత్యం సృష్టించటంద్వారానే సాంస్కృతిక



వికాసం జరుగుతుంది. ప్రాంతీయ జీవన, సాహిత్య ప్రమాణాలు వివేచించటానికి ప్రత్యేక ప్రమాణాలు రూపొందించుకోవాలని తెలంగాణ వాదం ప్రతిపాదిస్తున్నది. సాహిత్య, సామాజిక, రాజకీయ తాత్విక రంగాల్లో ప్రాంతీయ చైతన్యాన్ని విస్తరింపచేయటమే తెలంగాణవాద లక్షణం. లక్ష్యం కూడా.

1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమం నుండి అవసరమైనంత సాహిత్యస్పృహను అందుకోలేకపోయినప్పటికీ, అది అందించిన ధైర్యంతో రచయితలు కవిత్వంలో కథల్లో తెలంగాణ భాషను విరివిగా ప్రయోగించినారు. ఎమర్జెన్సీ తర్వాత ఈ ప్రాంతంలో వెల్లువెత్తిన రైతాంగ ఉద్యమాల ప్రేరణతో స్థానిక రచయితలు ఇక్కడ ఉద్యమ జీవితాన్ని ఈ భాషలో బలంగా చిత్రించారు. ఈ శతాబ్ది చివరి దశకం తెలంగాణ సాహిత్యానికి తెలంగాణ వాదానికి విశిష్టతను సంతరించిపెట్టింది. అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి రచించిన "శ్వేతరాత్రులు" తెలుగు కథాగతిని, ప్రమాణాల్ని మార్చివేసింది. తెలంగాణ జీవితానికి భాషకు అంతకు ముందెప్పుడూ దొరకని స్థానం దొరికింది. తెలంగాణ భాషలో ఫీచర్స్ ప్రారంభమైనాయి. ఉప్పల నరసింహం 'ముద్ర', కైత్కాల పోశెట్టి "బండకింది బతుకులు", తెలిదేవర భానుమూర్తి "పలుకుబడి" తదితర కాలమ్స్ బహుళ వ్యాప్తి పొందినయి. అలిశెట్టి ప్రభాకర్ 'సిటీలైఫ్' దినాంకవిత ఆదరణ పొందినయి.

స్థానిక పలుకుబడులు, అభివ్యక్తులు కలగల్సిన తెలంగాణ ముద్రతో కవిత్వం వచ్చింది. వరవరరావు 'ముక్తకంఠం', సిధారెడ్డి 'సంభాషణ', జూకంటి జగన్నాథం 'పాతాళగరిగె' తెలంగాణ నుడికారాన్ని సాహిత్యంలోకి తెచ్చినయి. గద్దర్ పాటలు తెలంగాణ భాషకు పట్టం కట్టినయి. వసంతరావు దేశపాండే 'అడవి' నవల చతుర నవలలపోటీలో బహుమతి గెల్చుకున్నది. సాహు అల్లంరాజయ్యల 'కొమురం భీము' నవల వెలువడింది. ఈ రెండు నవలలు ఆదిలాబాద్ గిరిజనులైన గోండుల జీవితాన్ని ప్రతిభావంతంగా చిత్రించినయి. పులి ఆనందమోహన్ రాసిన 'వసంత గీతం' రహస్య ఉద్యమ జీవితాన్ని ప్రాంత సాంస్కృతిక భౌగోళిక విశేషాలతో చిత్రిక పట్టిన విశేషనవలగా రాణించింది. సాధనరాసిన 'రాగో,' కౌముది రాసిన 'తెలంగాణ పల్లె', వనజ విద్యనేర్చి రచించిన 'అడవి పుత్రిక' ఈ ప్రాంత పల్లెల వాతావరణాన్ని ఉద్యమ ఆటుపోట్లను వివరించినయి.

గద్దర్ వేషధారణలో, వ్యక్తీకరణలో తెలంగాణ తనం ఉట్టిపడి ఒక నమూనా అయింది. గూడ అంజయ్య 'ఊరుమనదిరా' సినిమా ప్రపంచంలో సైతం ఆదరణ పొందింది. తెలంగాణ కళారూపం ఒగ్గుకథ బాగా ప్రాచుర్య పొందింది. ఎరువులకోసం రైతుల సత్యాగ్రహాన్ని దర్భశయనం శ్రీనివాసాచార్య, చెరుకు రైతుల దైన్యాన్ని నాళేశ్వరం శంకరం, శవ ఊరేగింపు

ముందు నాట్యంచేసే 'కొల్పులోల్ల' హృదయవిదారక స్థితిని మోతుకూరి అశోక్, కాలుష్యం కాటేసిన జీవితాల విషాదాన్ని అమ్మంగి వేణుగోపాల్, పరిశ్రమలు మూతపడిన కార్మికుల ఘోషను వఝల శివకుమార్ చిత్రిస్తూ రాసిన కవితల్లో ప్రాంతీయత వ్యక్తమైంది.

అస్తిత్వ ఉద్యమాలుగా వచ్చి తెలుగు సాహిత్య రంగాన్ని కుదిపివేసిన దళిత, స్త్రీవాద ఉద్యమాలు తెలంగాణలో చెప్పుకోదగినంత ప్రభావాన్ని చూపించలేదు. బియస్‌రాములు కథలు, గోసంగి కవులు, బహువచనం కవులు, మాష్టార్జీ పాటలు, వేముల ఎల్లయ్య 'కక్క' నవల ఇక్కడి దళిత జీవితాన్ని చిత్రించినయి. అనిశెట్టిరజిత స్త్రీవాద స్పర్శతో కవిత్వం రాసింది. తెలంగాణనుంచి విరివిగా సాహిత్యం వెలువడినప్పటికీ ప్రాంతీయ ముద్రతోనే సరిపెట్టుకోవలసి వచ్చింది.

1996 నుండి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఊపందుకున్న తర్వాత స్థానిక రచయితల్లో ప్రాంతీయ స్పృహ, చైతన్యం వెల్లువలా పెల్లుబికింది. ప్రత్యేక అస్తిత్వ చైతన్యంతో వచ్చిన రచనలు సంచలనం కలిగించినయి. సాహిత్యానికి ప్రాంతీయవాద మేమిటని స్థానికేతరులు చర్చలు లేవదీశారు. తెలుగుతల్లి ముక్కలౌతుందని వ్యాసాలు, కవితలు వస్తున్నాయి. తెలంగాణా వాదులైన విమర్శకులు వాటికి చాలా బలమైన సమాధానాలు చెప్పారు. స్థానికుల్లో కూడా తెలంగాణ సాహిత్యమనాలని, తెలంగాణ వాదమనాలని చర్చలు జరిగినయి. స్థానిక కవుల్ని కూడా మార్మికత, శిల్పలౌల్యం కబళిస్తున్న దశలో తెలంగాణవాదం సాహిత్యకారులకు దిశానిర్దేశం చేస్తున్నది. బలమైన స్పష్టమైన వస్తువును పదునైన శైలిని అందిస్తున్నది. చరిత్రనుంచి, అనుభవంనుంచి అనేక అంశాల్ని పునరంచనావేసి కొత్త వాక్యాలు లిఖిస్తున్నది.

ఇటీవల జూలూరు గౌరీశంకర్ సంపాదకత్వాన 106గురు తెలంగాణ కవుల కవితా సంకలనం 'పొక్కిలి' వెలువడింది. తెలంగాణవాద కవిత్వానికి 'పొక్కిలి' గొప్ప ప్రేరణ. డా. ముదిగంటి సుజాతారెడ్డి పరిశోధనచేసి సేకరించిన ముప్పై అయిదుకథలతో ప్రచురించిన 'తెలంగాణ తొలితరం కథలు' స్థానిక సాహిత్యాన్ని మలుపుతిప్పింది. మంజీరా రచయితల సంఘం 'ఎడపాయలు', నూతన సాహితి 'సిమాంట', సాహితీసమితి 'ప్రసారిత', నిజామాబాద్ కవుల 'గాయి' కవితాసంకలనాలు ప్రాంతీయ స్పృహతో వెలువడి తెలంగాణ భావనల్ని ప్రసారం చేస్తున్నాయి.

తెలంగాణ జీవన వేదనను చిన్న కవిత వ్యక్తం చెయ్యలేదు గనుక దీర్ఘకవితలు, కావ్యాలు వెలువడుతున్నయి. ఆ వరుసలో జూలూరు గౌరీశంకర్ 'నా తెలంగాణ' మొదటిది. వనరుల పరాయీకరణ, సాంస్కృతిక వక్రీకరణ కవితాత్మకం చేశాడు. శిరసు 'నల్లవలస' ప్రత్యేకంగా పేర్కొనవలసిన కావ్యం. చాలా బలమైన, సునిశితమైన వ్యక్తీ కరణతో తెలంగాణ చైతన్యాన్ని



ఆవిష్కరించిందీ కావ్యం. సుంకిరెడ్డినారాయణరెడ్డి 'దాలి' ప్రాంతీయ భాషలో ప్రాంతీయ స్పృహను వ్యక్తీకరించిన కావ్యం. యం. వెంకట్ రాసిన 'వర్జి' జిల్లా మాండలిక భాషను సజీవంగా పట్టుకున్నది. చాలారోజుల తర్వాత అల్లం నారాయణ అందించిన 'ఒక యాది మనాది' మంచి కావ్యంగా రూపుదిద్దుకున్నది. వస్తు స్పృహ, భావావేశం, జీవభాష ముప్పిరిగా అల్లుకొని ప్రాంతీయ వాస్తవికతను ప్రతిభావంతంగా చిత్రించింది. సూరేపల్లి మనోహర్ 'నల్లగొండా నాయమ్మ', తైదల అంజయ్య 'తెలంగాణ', చైతన్య ప్రకాశ్ 'యిమరాస' దీర్ఘకవితలుగా వెలువడినాయి. అఫ్సర్, జూకంటి జగన్నాథం, సిధారెడ్డి, అన్నవరం దేవేందర్, అనిశెట్టి రజిత, వేణూ సంకోజు, పగడాల నాగేందర్, కందుకూరు దుర్గాప్రసాద్, కందుకూరి శ్రీరాములు, పప్పుల రాజిరెడ్డి, వేముగంటి మురళీకృష్ణ, కృష్ణమూర్తి యాదవ్, దాసరాజు రామారావు, సిద్ధార్థ, ఐలేని గిరి, గురుస్వామి, విద్యాసాగర్, ఎద్దుకొమ్ముజెట్టయ్య మరెందరో కవులు తెలంగాణ స్పృహలో కవిత్వం రాస్తున్నారు. గాలికట్ట, తొవ్వ, తండ్లాట, గోరుకొయ్యలు, కవ్వం, ఉసురు, మొగులైంది, వరదగూడు, పాతాళగరిగె, గోగుపువ్వు, ఎర్నోషి, ఎన, మొగి, పావురం మొదలైన కవితా సంపుటాల పేర్లు తెలంగాణ ప్రాంతీయ స్పృహను ప్రతిబింబిస్తున్నయి. నల్లా ఉపేందర్ ఛందోబద్ధంగా 'తెలంగాణ శతకం' రచిస్తే, కోట్ల వేంకటేశ్వరరెడ్డి 'తెలంగాణ నానీ'లు అల్లినాడు.

వచన కవిత్వంతో పాటు పాటలు పుష్కలంగా వచ్చినయి. తెలంగాణ మట్టిలోనే పరవళ్లుతొక్కే పాట ప్రత్యేకమైంది. పాట కాచిన పట్టు అంటాడు కవి. ఈ భాషలో లయబద్ధమైన ఛందస్సుంటుందని నలిమెల భాస్కర్ సోదాహరణంగా ఉత్తేజంగా ప్రసంగిస్తాడు. మంజీరా రచయితల సంఘం ప్రచురించిన ప్రత్యేక తెలంగాణ కోసం 'తెలంగానం' పాటల సంకలనం పాటల వరుసలో మొట్టమొదటిది. ఉద్యమ విస్తృతికి పాట ముఖ్యమైన పరికరం. అరుణోదయ కళామండలి ప్రచురించిన 'తెలంగానం' రెండోది. ఇతర గీతాలతో కూర్చబడిన సహచర బుక్‌హౌస్ 'తెలంగాణ పాటలు' ప్రచురించి విస్తృత ప్రచారం సాగిస్తున్నది. ప్రజాకళామండలి 'నా తెలంగాణ' ప్రచురించి పాటల్ని ప్రజల దగ్గరకు చేర్చింది.

ప్రజాకళామండలి 'నా తెలంగాణ', తెలంగాణ స్టడీస్ సెంటర్ 'తెలంగాణ గర్జన', 'తెలంగాణ పోరు', తెలంగాణ కళామండలి క్యాసెట్లు, అరుణోదయ 'గోదావరి జలాలు' క్యాసెట్ అనేక ఆడియో క్యాసెట్లుగా వెలువడి ప్రజాబాహుళ్యంలో ప్రాంతీయ భావనను ప్రోదిచేస్తున్నయి.

తెలంగాణ గాయకుల్లో తెలం'గానలలిత'గా రాణకెక్కిన బెల్లి లలితను చెప్పుకోవాలి. తెలంగాణ స్పృహతో అద్భుతంగా పాటలు రాసి, పాడి కళారంగాన్ని తీవ్రంగా ప్రభావితం

చేసిన గొప్ప గాయకుడు గోరటి ఎంకన్న. ఎంకన్నది విశేషమైన ప్రతిభ. సజీవమైన సంగీతం. తెలంగాణ భాషలోని తీయందనాన్ని తీగమీద మీటుతున్న గాత్రంతో ప్రపంచీకరణ విధ్వంసంలో పల్లెల దీనస్థితిని ఆవిష్కరించాడు. మరో ప్రతిభావంతమైన వాగ్గేయకారుడు అందెశ్రీ. ఈయన పాటల్లో తెలంగాణ పల్లెజీవితం, వలస పెత్తనాల యాతన వ్యక్తమైంది. సదాశివుడు రాసిన 'తలాపునే పారుతోంది గోదారి అయినా నీ చేను నీ చెలకా ఎడారి' పాటలో ఇక్కడి నీటి దుఃఖం, సిధారెడ్డి 'నాగేటిచాళ్లల్ల నా తెలంగాణ' పాటలో స్థానిక సాంస్కృతిక విశేషాలు రూపుదిద్దుకున్నయి. వందలాది పాటలు అవసరానికి ఆశువుగా పుట్టి తెలంగాణ ప్రజల నీళ్లు దొరకని నాలుకల మీద ప్రవహిస్తున్నాయి.

కవిత్వంలో ప్రభావశాలిగా ఉన్న తెలంగాణ భావన వచన ప్రక్రియలైన కథ, నవలల్లో మరింతగా రూపుదిద్దుకోవలసి ఉన్నది. కోస్తాంధ్ర వలస పెత్తనం నేపథ్యంలో వచ్చిన చంద్రలత 'రేగడి విత్తులు' నవల చర్చకు దారితీసింది. ప్రాంతమ్మీద విషం చిమ్మిందని తెలంగాణ వాదులు అభిప్రాయపడ్డారు. బదులుగా పులుగు శ్రీనివాస్ 'సంకరవిత్తులు' కథ రాశాడు. వసంతరావు దేశపాండే "ఊరు" నవల గోండుల జీవనంలోని మార్పులను చిత్రిస్తే, బి. మురళీధర్ 'నిరుడు కురిసిన కల' మారుతున్న గ్రామీణ జీవన దృశ్యాన్ని ప్రతిబింబించింది. కాలువ మల్లయ్య 'సాంబయ్య చదువు' 'భూమిపుత్రుడు', బోయజంగయ్య 'బొమ్మ' స్థానికతను అందిపుచ్చుకున్నయి.

బలమైన ధోరణిగా రాకపోయినా కథల్లో కూడా ప్రాంతీయ స్పృహ చోటుచేసుకుంటున్నది. అల్లం రాజయ్య 'అతడు', తుమ్మేటి రఘోత్తం 'పనిపిల్ల' కథల్లో ప్రాంతీయ ముద్రలున్నయి. ప్రాంతీయతా సందర్భంలో ప్రముఖంగా రూపొందిన కథకులు ఇద్దరు. ఒకరు ముదిగంటి సుజాతారెడ్డి. మరొకరు పెద్దింటి అశోక్‌కుమార్. ముదిగంటి సుజాతారెడ్డి 'ఇసుర్రాయి' కథాసంపుటి స్థానిక జీవితాన్ని ఆవిష్కరించింది. తెలంగాణ స్థానికతను స్త్రీ కోణంలోంచి చిత్రించిన కథలెన్నో రాశారామె. వృత్తులు కోల్పోతున్న దైన్యాన్ని, వనరులు తరలిపోతున్న విషాదాన్ని, స్థానిక జీవితంలోని తండ్లాటను పట్టుకొని పెద్దింటి అశోక్‌కుమార్ గొప్ప కథలు రాశాడు. కాలువ మల్లయ్య 'తెలంగాణ మట్టికథలు' పేర్కొనదగినవి. 'అవ్వతోడు గిది తెలంగాణ' మల్లయ్య మరో స్థానిక జీవనచిత్రణ. అంబల్ల జనార్దన్ 'బొంబాయి బతుకులు', అశోక్‌కుమార్ 'వలసకథలు' బతుకు కోల్పోయిన తెలంగాణ పేదప్రజల వలసల దయనీయతను, కష్టాల్ని చిత్రించినయి. పి. చంద్ 'భూనిర్వాసితులు' కథలు వ్యవసాయ జీవనం కోల్పోయి బొగ్గుగనుల్లో కూరుకుపోయిన జీవితాల్లోని కన్నీళ్లను విప్పిచెప్పినయి. దామోదరరావు 'గిరివి', చైతన్యప్రకాశ్ 'రేణ', అశోక్‌కుమార్ 'పేగుముడి', బెజ్జారపు



వినోద్‌కుమార్ 'సంశయం', జూకంటి జగన్నాథం 'వైపని', జింబో 'చెప్పులు', బెజ్జారం రవీందర్ 'గోగుపూల పాట', శ్రీధర్ దేశపాండే 'ముసురిడ్సిన మొగులు', బోధనం నర్సిరెడ్డి 'పేగుబంధం', కాలువ మల్లయ్య 'సొసంత్రం', సుజాతారెడ్డి 'కొసరి కొసరి బేరాలు', భూపాల్ 'అంబల్లబండ', కె.వి. నరేందర్ 'దొరుంచుకున్నదేవక్క' 'స్వర్ణపిశాచం' మొదలైన కథల్లో ప్రాంతీయ స్పృహ వ్యక్తమయింది.

పులుగు శ్రీనివాస్ 'రాజయ్య చదువు', కాసుల ప్రతాపరెడ్డి 'లవ్ 2020', 'దగ్ధం' కథల్లో వలస వాదం మీద విపరీత ఆగ్రహం ప్రకటితమైంది. తెలంగాణ కథల్లో ప్రాంతీయ ముద్ర బలంగానే ఉన్నప్పటికీ ప్రాంతీయ స్పృహ, ప్రాంతీయ చైతన్యం పెరగవలసిన అవసరమున్నది.

తెలంగాణవాదం నిర్మాణమవుతున్న ప్రతి దశను విశ్లేషిస్తూ కె. శ్రీనివాస్ చాలా వ్యాసాలు, కాలమ్స్ రాశాడు. చరిత్రలోంచి, సాహిత్యంలోంచి తవ్వితీసి కొత్తకోణాలు ఆవిష్కరిస్తూ 'స్థానికతా విమర్శ'కు భూమికను సిద్ధంచేశాడు. సాహిత్యంలో తెలంగాణ వాదం స్థిరపడటానికి శ్రీనివాస్ కృషి ప్రత్యేకమైనది. తెలంగాణ ప్రాంతీయతా విమర్శలో గుడిపాటి 'ఫాయిదా' మొదటి వ్యాససంపుటి. తెలంగాణ సందర్భాన్ని వివరించిన విశ్లేషణాత్మక వ్యాసాలు ఇందులోఉన్నయి. తెలంగాణ సాంస్కృతిక వేదిక వివిధ రచయితల నుంచి సేకరించి చర్చా విషయాలతో 'తెలంగాణ తోవలు' వ్యాససంకలనం ప్రచురించింది. సాహితీ విమర్శకులు ఎస్. సదాశివ 'యాది' స్మృతులు ప్రాంతీయ కోణాన్ని పరిపుష్టం చేస్తున్నయి. ఇవేకాక చాలామంది కవులు, రచయితలు తాము స్వయంగా వ్యాసాలు రాయటం ప్రాంతీయ చైతన్యం తెచ్చిన మరొక పరిణామం. ఉద్వేగంతో అనుభవాలు వివరించే కాలమ్స్, ఆర్టికల్స్‌ని పాత, కొత్తతరం రచయితలు రాస్తూ ఉండటం ఇంకా కొనసాగుతున్నది.

తెలంగాణ రచయితల వేదిక 'సోయి' సాహిత్య సంచికల ద్వారా ప్రాంతీయ సాహిత్య ప్రాధాన్యతను వివరించి వివిధ జిల్లాలకు అల్లుతున్నది. రచయితల్లో, గాయకుల్లో ప్రాంతీయతా స్ఫూర్తిని ముట్టిస్తున్నది. 'ముల్కీ', ' నాతెలంగాణ', 'తల్లి తెలంగాణ', 'తెలంగాణ రాస్తా' లాంటి పత్రికలు తెలంగాణ భావప్రచారానికే అవతరించినయి.

*కన్నీళ్లలోనూ*
*నీళ్ళను దర్శించే మా జీవితం మీ కర్థంకాదు*
*మీ కవిత్వం మా కర్థంకాదు*
*తమిళ తంబికి భయపడి*
*మా నగరానికి వలసవచ్చిన వాడా*
*నగరం మాదే!*
*భాగ్యం మీదయింది* (నల్లవలస)

జగన్నాథ రథచక్రాలు
మా నేలమీద దిగనేలేదు
భగీరథాలు మా నదుల్ని దారి మళ్లించాయి
తెలుగుతల్లి తన కలశాన్ని
తెలంగాణలో ఒంపలేదు
ఓ నీటిపారుదలా - నీ రస్తా కోస్తాకే
నిజం దేవుడెరుగు - నీరు కోస్తా నెరుగు
పల్లం ఒక నెపం మాత్రమే   (నల్లవలస)

స్థానిక ప్రజల తక్షణ స్పందనలను చిత్రికపట్టిన పదునైన ఖండికలు, భావావేశం పొంగిన దశలో భాష, శిల్పం తన్నుకొని వస్తాయనటానికి సరైన సాక్ష్యమిది. కవి భావతీవ్రత ఎంత బాగా వ్యక్తమయిందంటే ఈ పంక్తులు ఏ సభలో ఉటంకించినా వేలమంది సభికుల నుంచి అమోఘమైన ప్రతిస్పందన వస్తుంది. తెలంగాణ కవి కోపతీవ్రత, శిల్ప ప్రతిభ ప్రతి కవితలోనూ కనిపిస్తయి. 'కృష్ణా గోదావరి జలాలను కబళించటమే' మీ సిద్ధాంతమని అంతే తీవ్రంగా నిలదీస్తాడు.

ప్రాంతీయ విశ్లేషణ మొదలైన తర్వాత ఎన్నో ఆశ్చర్యకరమైన సత్యాలు వెలుగులోకి వస్తున్నయి. స్వాతంత్ర్యదినమైతే జరుపుకుంటున్నం గానీ భారతదేశానికి, ఆంధ్రులకు స్వాతంత్ర్యం వచ్చిన ఆగస్టు 15, 1947న తెలంగాణ ప్రజలకు స్వాతంత్ర్యం రాలేదు. 1948 సెప్టెంబరు 18న భారత యూనియన్‌లో కలిసేదాకా ఏడాదికి పైగా చిత్రహింస పడిందిక్కడి జీవితం. అధికార ఆంధ్ర చరిత్రలో తెలంగాణ స్వాతంత్ర్య విముక్తి దినానికి స్థానం లేకపోయింది.

అన్నీ నా నోటిదాకా వచ్చిపోయినవే మరి
చివరికి స్వాతంత్ర్యం కూడా
నా పంద్రాగస్టు
ఓ పెద్ద వెక్కిరింత కాదూ
అందరూ మూడురంగుల జెండా ఎగరేస్తున్నప్పుడు
నా శరీరం ఒకేఒక్క నెత్తుటి రంగులో
తలకిందులుగా ఏ చెట్టుకొమ్మకో వేలాడుతోంది (అఫ్సర్)

ప్రత్యేకరాష్ట్ర ఏర్పాటు వేర్పాటువాదమనే విమర్శ ఎదుర్కొంటున్నది. తెలుగునేల



ముక్కలవుతుందని, తెలుగుతల్లి విలవిలలాడుతుందని ప్రాంతేతరుల నుంచి విమర్శ వచ్చింది. దానికి తెలంగాణ కవి తీవ్రంగా స్పందించాడు.

నా కాళ్లకింది పంటపొలాల్ని అగ్గువ సగ్గువకు కొని
ముక్కలుచేసి అమ్మినపుడు యాడబోతివిరా
జిల్లాను పేజీలు పేజీలుగా పాపినప్పుడు యాడవోతివే మాయమ్మ
ఊరిని తుకుడలు తుకుడలుగా లారీల కెక్కించినపుడు యాడవోతివే

..........................................................

మన నేల ఒకటే మన జాతి ఒకటే అయితే
బతుకులొక్క తీర్గ ఎందుకు లెవ్వురా అయ్యా
మన తల్లి ఒకటే అయితే
మాతృస్తన్యం మాకెందుకు దొరకదురా

అభివృద్ధిచెందిన ప్రాంతాలు, వెనుకబడేయబడిన ప్రాంతాల మీద చేస్తున్న అఘాయిత్యాలు ఆర్థిక అంశాలకు సంబంధించినవి మాత్రమే కాదు. సాంస్కృతికరంగం మొత్తం బలయిపోతుంది.

బడి నీది
భాష నీది
భాధ మాత్రమే నాది
నా భాషలో బడి లేదు
బడిలో మా అమ్మ పలుకు లేదు
నా భాషను ధ్వంసంచేసి నీ భాషకు అధికారమిచ్చావ్
భాషను కోల్పోయి బానిసలమయ్యాం

నిజాం పాలనలో జమీందార్ల కింద, జాగీర్దార్ల కింద 'నీబాంచెన్' అని తలొంచి బతికిన 'బానిసబతుకు'నుంచి బయటపడేటందుకు ఇక్కడి ప్రజలు వీరోచిత పోరాటం చేశారు. తిరిగి తిరిగి ఇన్నేండ్ల స్వతంత్రదేశాన ఆంధ్ర పాలనలో అధికార్ల కింద, ఆక్రమణదార్ల కింద బానిసలైన దీనత్వాన్ని గుర్తించారు. తెలంగాణది ఒక బాధకాదు. ఒక పంచాయితి కాదు. కవి మాటల్లో "కొల్లగొట్టిననీళ్ళ పంచాది/సంకరం చేసిన భాష పంచాది/నిలబడి కలబడే సంస్కృతి పంచాది/పచ్చటి పొలాలల్ల లేచిన బంగ్లాల పంచాది/ఆక్రమించుకున్న హైద్రాబాద్ పంచాది'' ఇవన్నీ సమస్యల పరిష్కారం కోసం ప్రత్యేక రాష్ట్రం, స్వయంప్రతిపత్తి

అడుగుతున్నరు. ప్రాంతీయ దృష్టితో తెలుగుజాతిని పునర్నిర్వచిస్తున్నరు. ఆంధ్ర, తెలంగాణ రెండుజాతుల సిద్ధాంతాన్ని ఆవిష్కరిస్తున్నరు. తెలుగుతల్లి 'కృతకభావన'నే తీవ్రంగా ప్రశ్నిస్తున్నరు.

*ఒక కల్పిత దేహం*
*రెండు ఆత్మలు*
*ఒక ఒర - రెండు కత్తులు*

అని నొక్కిచెబుతున్నాడు 'సోయి' వొచ్చిన కవి.

*కొల్లగొట్టిన వనరుల జాడ*
*పాముపడగల నీడల్ల*
*వాడిపోతున్న పచ్చటి బతుకులు*
*రెండు అసమ సమాజాల పొత్తు*
*రెండు ఆత్మల దేహం ముక్కలవక తప్పదు (ఒక యాది మనాది)*

స్పష్టమైన లక్ష్యంతో, లోతైన అవగాహనతో ఇవాళ తెలంగాణవాదం నిర్మాణమవుతున్నది. సాహిత్యంలో తెలంగాణ అన్ని పార్శ్వాలాకు అల్లుకుంటున్నది. వాస్తవికత కోణం, చరిత్ర పునరంచనా, ప్రగాఢ భావావేశం, ప్రవాహశైలి, పదునైన వ్యక్తీకరణ తెలంగాణ సాహిత్యాన్ని స్థానిక అవసరాలకనుగుణంగా మలుస్తున్నయి. తెలంగాణ సాహిత్య నిర్మాణాన్ని వివేచించటానికి తెలంగాణీయత అవశ్యం. అందువల్ల వివేచించే పని స్థానిక విమర్శ నుంచి, స్థానిక ప్రమాణాల్నుంచి జరగాలి. సిద్ధాంతం తెలియదని, మొనాటనినీ, రూపశ్రద్ధ లేదని, శిల్పం ఒదగలేదని తరచుగా చేసే ఆధిపత్యవాద విమర్శల నుంచి ప్రాంతీయతా సాహిత్యాలు రక్షింపబడటానికి, సహజంగా సజీవంగా సృజనరంగం వికసించటానికి వీలయిన విధంగా ప్రాంతీయ సాహిత్య ప్రమాణాలు నెలకొల్పుకోవాలి. ప్రాంత జీవన స్పందనలు ప్రాంతేతరులను కదిలించకపోవచ్చు. సహృదయం, ప్రజాస్వామిక దృష్టి,చారిత్రక అవగాహన, దుఃఖస్పర్శ, నిజాయితీ, విశాల భావన తగిన విధంగా లేనప్పుడు 'ప్రాంతీయత' 'స్థానిక' ఆకాంక్షలు అర్థం కావటం కష్టం. గుణాత్మకమైన పరిణామాల్ని, చలన సూత్రాల్ని, చారిత్రక సందర్భాన్ని బలంగా నిరూపిస్తూ తలెత్తిన అస్తిత్వ ఉద్యమాలలో ప్రాంతీయ ఉద్యమాలు మరింత ప్రత్యేకమైనవి. అదే క్రమంలో తెలంగాణ ఉద్యమాన్ని, సాహిత్యాన్ని పరిగ్రహించాల్సి ఉంటది.

*- మూల్యాంకనం, జనవరి 2003*



# సాంస్కృతిక ఆధిపత్యానికి సాక్ష్యాలు కావాలా!

**అ**భివృద్ధి జరుగుతున్నది కనుక ప్రత్యేక రాష్ట్రవాదం కనుమరుగవుతుందని రాష్ట్ర ముఖ్యమంత్రివర్గం కొన్ని రోజులుగా పదేపదే ప్రకటిస్తూ వస్తున్నది. తెలంగాణ ప్రజల మెదళ్ళను క్రమంగా జయించడానికి నిశ్శబ్దంగా, వ్యూహాత్మకంగా జరుగుతున్న సాంస్కృతిక దాడిగా దీనిని అర్థం చేసుకోవాలి. నిజానికి, ఏ అభివృద్ధి ఏ సమాజానికీ ఆత్మగౌరవం చేకూర్చలేదు. అభివృద్ధి స్వయంనిర్ణయాధికారానికి ప్రత్యామ్నాయం కాదు. తెలంగాణ వాదంలో అభివృద్ధి ఒక కోణం. అంతే సమానంగా అస్తిత్వ, ఆత్మగౌరవాల కోణం ఇమిడి ఉంది. ఉమ్మడిరాష్ట్ర అవతరణ నుంచి నలభైఏళ్లుగా ఎంత వివక్ష కొనసాగిందో, ఇప్పటి తెలంగాణ ఉద్యమం సాగుతున్న ఈ పదేళ్లలోనూ అంత సాంస్కృతిక వివక్ష అమలవుతున్నది. గత తెలుగుదేశం ప్రభుత్వమైనా, ఈ రెండున్నర ఏళ్ల కాంగ్రెస్ ప్రభుత్వమైనా తెలంగాణకు సంబంధించినంతవరకు ఆంధ్రుల ప్రభుత్వమే గనుక, ఆంధ్రా సాంస్కృతిక ఆధిపత్యం నిరంతరాయంగా, తేడా లేకుండా కొనసాగుతున్నది.

తెలంగాణ ఎదుర్కొంటున్న సాంస్కృతిక వివక్షలో భాష కీలకమైనది. వలసవచ్చిన కోస్తా పెట్టుబడివర్గం, మేధావివర్గం, సాంకేతిక వర్గం కలిసికట్టుగా జరుపుతున్న దాడిలో తెలంగాణ భాష తల్లడిల్లుతున్నది. పత్రికలు, రేడియో గతంలో ప్రదర్శించిన వివక్ష కొంత తగ్గినప్పటికీ టివి, సినిమా రంగాలు విపరీతంగా దాడిచేస్తున్నాయి. సినీ పరిశ్రమ మద్రాసు నుంచి హైదరాబాద్ తరలివచ్చిన తర్వాత సినిమా వాళ్లకు తెలంగాణ పాత్రలు, భాష అగ్గువ దొరికినాయి. జోకర్లుగా, రౌడీలుగా, విలన్లుగా చిత్రించి ఆ పాత్రలకు తెలంగాణ మాటలు పెట్టి దారుణంగా అవమానిస్తున్నారు. పది సంవత్సరాలుగా తెలంగాణ ఉద్యమం అనేకసార్లు హెచ్చరించినప్పటికీ ఏమీ మార్పులేదు. పైగా, ఎప్పుడూ లేనివిధంగా 'ఆంధ్రుడు', 'ఆంధ్రావాలా' వంటి సినిమాలతో పరోక్షంగా స్థానిక ఉద్యమాల్ని రెచ్చగొడుతున్నారు. 'పోలవరం' ప్రాజెక్టు నిర్మాణంతో మూడువందల గ్రామాలు ముంపునకు గురవుతాయని స్థానిక ఆదివాసీలు ఆందోళన చేస్తుంటే 'బన్నీ' సినిమాలో 'పోలవరం' పాట పాడారు.

తెలంగాణ ఉద్యమాన్ని సమర్థిస్తున్నందుకు విజయశాంతి నటించిన కటౌట్లను కోస్తా కేంద్రాల్లో పడగొట్టారు. తెలంగాణ ఉద్యమం శాంతియుతంగా నడుస్తున్నది గనుక సరిపోయింది గానీ, కోస్తా వలసవాదులు నటించిన సినిమాల కటౌట్లు తెలంగాణలో పడగొట్టడం అసాధ్యంకాదు గదా. ఈ ఘటనలో వ్యక్తమైంది కోస్తా ఆధిపత్య ధోరణులే.

టివిఛానెళ్లు ఇంతకంటె విపరీతంగా ప్రవర్తిస్తున్నాయి. తెలంగాణ సంభాషణలు పెట్టి పాత్రలకు, వ్యక్తిత్వాలకు అల్పత్వం ఆపాదిస్తున్నారు. నవ్వులాట యాంకర్లు సందు దొరికినప్పుడల్లా తెలంగాణ భాషను, ఉద్యమాన్ని అపహాస్యం చేయటం పెరిగిపోతున్నది. వార్తాప్రసారాల శీర్షికల్లో ఇక్కడి పలుకుబడులను, జాతీయాలను వాడి వంకరప్రయోగాలు చేస్తున్నారు. చులకనచేసే తత్వం ఆధిపత్యం నుంచి రూపొందిందే. 'తెలుగు అకాడమీ' తెలంగాణ భాషకు చేసిన అన్యాయం తక్కువేమీ కాదు. ప్రామాణిక భాష పేరిట కోస్తా ఆంధ్రభాషలో పాఠ్యగ్రంథాలు ప్రచురించి తెలుగంటే కోస్తా తెలుగని నిర్ధారించింది. స్థానిక విద్యాసంస్థల్లో, విద్యార్థుల్లో స్థానిక భాషకు స్థానం లేకుండా చేసింది. అధ్యాపకుని బోధననుంచీ విద్యార్థి పరీక్ష నుంచీ తన మాతృభాషను దూరంగా ఉంచగలుగుతున్నది.

## చరిత్రకు మసిపూసే యత్నం

తెలంగాణ చరిత్రకు మసిబూసే ప్రయత్నం ఈ మధ్యకాలంలో తీవ్రతరమైంది. అంతకు ముందటి వలసాంధ్రులు ఇక్కడి చరిత్రపట్ల కాస్తోకూస్తో ఆసక్తి కనబరిచినారు. ఇటీవలి వలసతరం తెలంగాణ చరిత్రను తృణీకరిస్తున్నారు. తెలంగాణ చైతన్యం పెరుగుతున్న కొద్దీ వారిలో అసహనం మరింత పెరుగుతున్నది. కొన్ని రోజుల కిందట తెలివాహనది గురించి, తెలంగాణ ప్రాచీనత గురించి ఒక పత్రికలో జరిగిన చర్చను కోస్తాప్రముఖులు తేలిగ్గా కొట్టిపారేశారు. ఒకాయనైతే, ఇప్పుడున్న తెలంగాణ ఒకప్పుడు ఆంధ్ర ప్రాంతమనీ, ఇప్పటి ఆంధ్ర ఒకప్పుడు తెలంగాణమని విశ్లేషించి తారుమారు వ్యాఖ్యానం చేసి గందరగోళపర్చడం వెనుక ఏ ప్రయోజనముందో గమనించవచ్చు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోసం పొట్టిశ్రీరాములు ప్రాణత్యాగం చేస్తే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కోసం అసువులు బాసినట్లు చెప్పడం, ఆంధ్రరాష్ట్రానికి మొదటి ముఖ్యమంత్రిగా పనిచేసిన ప్రకాశంపంతులు మనరాష్ట్ర ముఖ్యమంత్రిగా పేర్కొనడం తెలంగాణ భాగస్వామ్య తెలుగు చరిత్రను పక్కకు పెట్టడమే.

అనేక బాధలనుభవించి 1948 సెప్టెంబర్ 17న హైదరాబాద్ రాష్ట్రం భారతదేశంలో విలీనమయింది గనుక ఆ రోజును తెలంగాణ విలీన (విమోచన) దినోత్సవంగా ప్రకటించి రాష్ట్ర ప్రభుత్వం ఉత్సవాలు నిర్వహించాలని తెలంగాణవాదులు, సంస్థలు, టిఆర్ఎస్, బిజెపివంటి రాజకీయపార్టీలు ముఖ్యమంత్రిని కలిసి విజ్ఞప్తి చేసినప్పటికీ పట్టించుకోవడంలేదు.



నవంబర్ 1న ఘనంగా ఉత్సవాలు నిర్వహించే ప్రభుత్వం తెలంగాణ చరిత్రను చీకటిలో ఉంచటానికి ప్రయత్నిస్తున్నది. కనుక విలీనదినోత్సవం నిర్వహించడంలేదు. ఒత్తిళ్ళమేరకు పాఠ్యాంశంగా చేర్చిన కొమురం భీము చరిత్రను కొద్దికాలం తర్వాత తొలగించారు.

## పాఠ్యగ్రంథాల తీరు

కోస్తాంధ్ర చరిత్రను, సంస్కృతిని సుస్థిరం చేయటానికి ఉపకరిస్తున్న సాధనాలు పాఠ్యప్రణాళికలు. జాతీయ, రాష్ట్రస్థాయి ఎన్‌సిఇఆర్‌టి, ఎస్‌సిఇఆర్‌టి, బోర్డు ఆఫ్ స్టడీస్ మొదలైన పాఠ్యప్రణాళికల నిర్ణాయక కమిటీల్లో ఆంధ్రుల ఆధిపత్యం కారణంగా తెలంగాణ చరిత్ర, సంస్కృతులకు పాఠ్యగ్రంథాల్లో స్థానం లేకుండా పోయింది. ఆధునిక సంపాదక, రచయితలు సామాజిక అవగాహనతో ఇటీవల రచించిన పాఠ్యపుస్తకాల్లో ప్రధానంగా కోస్తా సాంస్కృతిక చరిత్ర మాత్రమే వెలుగుతున్నది. మదరాసు రాష్ట్రం నుంచి వేరుపడడానికి సాగిన ఆంధ్రరాష్ట్ర ఉద్యమం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నుంచి వేరుపడడానికి సాగిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం రెండూ ఒకే తీరు ఉద్యమాలయినప్పటికీ తెలుగు అకాడమీ చరిత్ర గ్రంథంలో ఒక దానికి ఉన్నతత్వం, మరోదానికి అల్పత్వం ఆపాదించారు. డిగ్రీ రెండవ సంవత్సరం విద్యార్థులకది పాఠ్యగ్రంథం. చదువుతున్నప్పుడు తెలంగాణ విద్యార్థులకు తమ ముందుతరం చేసిన ఉద్యమం గురించి ఏ భావన ఏర్పరచదలచుకున్నారో తెలుస్తూనే ఉన్నది.

ఒక భాషపట్ల అవహేళన అక్కడి సృజనాత్మకతను అణచివేస్తుంది. తెలంగాణలో జీవితం, ఉద్యమాలు ఎంతగా వర్ధిల్లినప్పటికీ దాన్ని సాహిత్యంగా సృజించుకోలేక పోవడానికి అణచివేత కారణమైంది. ఇంకా అదేస్థితి కొనసాగుతున్నది. తెలంగాణ రచయితకు తన భాషలో రాయడానికి ఇప్పటికీ సంకోచమే, భయమే. ఇటీవల సాంస్కృతికోద్యమాలు ఇచ్చిన స్ఫూర్తితో తెలంగాణ భాషలో కొంత కవిత్వం వస్తున్నది. కానీ, కోస్తా సాహిత్యకారులు సహించడంలేదు. తొలుత ఈ భాషకు సాహిత్యస్థాయి లేదని మాట్లాడినవాళ్లు ఇటీవల బాణీమార్చి అన్ని ప్రాంతాలవారికి తెలిసే తెలుగు రాస్తే బాగుంటుందని సూచిస్తున్నారు. రచనల్లో తెలంగాణ వాసన కనబడితే గతం కంటె ఎక్కువ చికాకు ప్రదర్శిస్తున్నారు. తెలంగాణ కవి రాసిన ఒక కవితా సంపుటికి ఒక ప్రగతి శీల సాహిత్యపత్రిక వక్రసమీక్ష ప్రచురించింది.

కొత్తగా పెరిగిన వనరులు, చైతన్యం ఆసరాతో వరంగల్ కేంద్రంగా తెలంగాణ సంపాదకవర్గం తెలుగులో ఏటా వచ్చిన కవితల్ని ఎంపిక చేసి 'కవితావార్షిక-2004' ప్రచురించింది. ఆధిపత్యం వదులుకోవడానికి ఎవరికీ ఇష్టముండదు. ఎప్పటినుంచో

సాహిత్యకేంద్రంగా ఉన్న విజయవాడకు వెన్నులో కదలిక ప్రారంభమైంది. పోటీగా 'కవిత-2004' ప్రచురించింది. ఒక ప్రముఖ విమర్శకుడు ఈ రెండు సంకలనాలను సమీక్షిస్తూ వరంగల్ సంకలనమెట్లా తక్కువస్థాయిదో, విజయవాడ సంకలనమెట్లా గొప్పదో వివరించటం యాదృచ్ఛికం కాదు, వ్యక్తిగతం కాదు. నీళ్లులేక తెలంగాణ అల్లాడుతూ పాలమూరులో 'కరువు' కవి సమ్మేళనం జరిపితే, వారు గోదావరి నది మధ్యన లాంచీలో ప్రభుత్వ ఖర్చుతో ఐక్యత కవి సమ్మేళనం జరిపారు.

## మల్లినాథుని ఇల్లు నేడు మరుగుదొడ్డి

తెలంగాణ సాంస్కృతిక చిహ్నాలుగా మిగిలిఉండి, బిక్కు బిక్కు మంటున్న ఖిల్లాలు, సంస్థానాలు, విగ్రహాలు, శాసనాలు చారిత్రక అవశేషాలుగానైనా గుర్తింపుకు నోచుకోకుండా నిర్లక్ష్యానికి గురవుతున్నాయి. శిల్పకారుడి పేరుమీద ప్రాచుర్యం పొందిన రామప్ప దేవాలయం తెలంగాణ శిల్పకళకు దర్పణం పడుతున్నా ఏ మరమ్మతుకూ నోచుకోవడంలేదు. సరైనరోడ్డుగానీ, అప్రోచ్ రోడ్డు దగ్గర ఒక తోరణంగానీ కనీసం ఒక బోర్డుగానీ లేకపోవడం టూరిజం శాఖ వివక్షను ప్రతిబింబిస్తున్నది. రామగిరి, ఎలిగందుల, మెదక్, బోనగిరి ఖిల్లాలు శిథిలమవుతున్నా ప్రభుత్వం పట్టించుకోవడంలేదు. కాగా శంకరంపేట, ఆందోలు, టేక్మాల్ సంస్థానాల కోటల ద్వారాలు, తలుపులు, అపురూప కళాఖండాలు హైదరాబాద్ ఫిల్మ్ స్టూడియోల్లో, ఫిల్మ్‌సిటీల్లో ప్రదర్శించుకోడానికి తరలిస్తుంటే స్థానికులు నిశ్చేష్టులుగా ఉండిపోవలసి వస్తున్నది. కొల్చారంనుంచి అతిపెద్ద జైన విగ్రహం తరలించబోతుంటే గ్రామస్థులు అడ్డుకొని కాపాడుకోవలసి వచ్చింది. కొల్చారం కాళిదాసు కావ్యాలకు జీవంపోసిన మల్లినాథసూరి స్వగ్రామం. ఆపండితుడిపేర బనారస్ విశ్వవిద్యాలయంలో పీఠం ఉంది. కానీ, ఈ రాష్ట్రంలో ఏమీలేదు. సూరి నివసించిన ఇంటిని అనేక విజ్ఞప్తులమేరకు ప్రభుత్వం స్వాధీనపరచుకున్నప్పటికీ ఏ స్మారక నిర్మాణమూ చేపట్టలేదు. ఆ ఇల్లు ప్రాంతం పశువుల పాకగా, మరుగు దొడ్డిగా, ప్రస్తుతం అతి దీనస్థితిలో ఉన్నది.

హైదరాబాద్ సాంస్కృతిక వికాసం కోసం తెలంగాణ ప్రముఖుల సహకారంతో నిర్మితమైన నగరకేంద్ర గ్రంథాలయానికి వట్టికోట ఆళ్వారుస్వామి విలువైన తన స్వంత రెఫరెన్సు లైబ్రరీని ఇచ్చాడు. ఎంతో అనుబంధమున్న ఆళ్వారుస్వామికి అక్కడ ఏ గుర్తూ లేక పోగా, ఆ గ్రంథాలయంతో ఏ సంబంధమూ లేని విశ్వనాథ సత్యనారాయణ విగ్రహాన్ని ఈ మధ్యనే నెలకొల్పి స్థానిక సాంస్కృతిక అస్తిత్వాన్ని గాయపరిచారు.

సాంఘిక వేడుకలుగా సాగే పండుగలు తెలంగాణ ప్రత్యేక జీవన శైలిని చాటుతాయి. ఇక్కడి ప్రజల అనుబంధాన్ని, ఆప్యాయతల్ని, ఆరాటాల్ని వ్యక్తంచేసే, ప్రపంచంలోనే అరుదైన



బతుకు పండుగ, పూల పండుగ బతుకమ్మ. చక్కటి నృత్యం, సజీవగానం కలగల్సిన కళారూపమిది. ఇటీవల కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలో హైదరాబాద్‌లో జరిగిన జాతీయ యువజన సాంస్కృతికోత్సవాల ప్రదర్శనల్లో 'బతుకమ్మ' కళారూపాన్ని చేర్చుమని స్థానిక కళాకారులు కోరినారు. అసలది కళారూపమే కాదని, కళారూపమైనా ప్రాంతీయ కళారూపమని, దాన్ని ప్రదర్శిస్తే రాష్ట్రప్రజల మనోభావాలు దెబ్బతింటాయని అధికారులు నిరాకరించారు. జిల్లాకే పరిమితమైన కళారూపాన్ని ప్రదర్శించటానికి లేని ఇబ్బంది ప్రాంత కళారూపాన్ని ప్రదర్శించడానికి ఏముంది?

మరొకటి హోళీ సంఘటన. ఈ సంవత్సరం హోళీ పండుగ ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థుల మధ్య జరుపుకోవాలని తెలంగాణ రచయితల వేదిక భావించింది. జానపదుల కోలాటంతో, పాటలతో, రంగులతో యూనివర్సిటీ ప్రాంగణంలో వేడుక జరుపుకుంటున్న సమయంలో అయిదారు వ్యానులనిండా పోలీస్ పటాలం దిగింది. స్థానికేతరుడైన సర్కిల్‌ఇన్‌స్పెక్టర్ వచ్చి తెలంగాణ పాటలు పాడితే తోలుతీస్తానని ఘర్షణకు దిగిండు. ఒక జర్నలిస్టు, ఒక రచయిత, ఒక ప్రొఫెసర్ అని కూడా చూడకుండా అయిదుగురిని అరెస్ట్ చేసి జులుంను, తెలంగాణ పట్ల అసహనాన్ని ప్రదర్శించాడు. అస్తిత్వ చైతన్యాన్ని అధికార బలంతో అణచవచ్చనే అహం, అన్ని జిల్లాల్లో వెల్లువెత్తిన నిరసనలకు ఓడిపోయింది.

సాంస్కృతిక అణచివేత, వక్రీకరణలతో ఆధిపత్యాన్ని నిలబెట్టుకునేటందుకు అభివృద్ధి చెందిన వర్గాలు ప్రయత్నిస్తుంటాయి. ఒకపక్క తెలంగాణ ఉద్యమం, అస్తిత్వ చైతన్యం చెలరేగుతున్న దశలోనే ఇట్లా వివక్ష కొనసాగుతుంటే మామూలు దశలో పరిస్థితి ఎట్లా ఉంటుందో అర్థంచేసుకోవచ్చు. అధికారవర్గాల ఇచ్ఛా వైఖరి ఎంతో కాలం నడవదు. ఆర్థికంగా జయించడం కంటె సాంస్కృతికంగా జయించడం కష్టం. యాభై ఏళ్లలో అనేక సంపదలు, వనరులు కొల్లగొట్టగలిగారు గానీ తెలంగాణ సాంస్కృతిక పరంపరను అదృశ్యం చేయలేకపోయారు. సాంస్కృతిక వారసత్వం శక్తివంతమైంది. ఆత్మగౌరవం జాతి మూలాలకు సంబంధించినది. ప్రత్యేక అస్తిత్వాన్ని పరిరక్షించుకోవడం, ఘర్షణ పడుతూ గంభీరంగా అల్లుకుంటున్న తెలంగాణ చైతన్యానికి పరీక్ష.

*- 'వార్త', 6 సెప్టెంబర్ 2006*

*- 'విశాలాంధ్రతో తెలంగాణకు విద్రోహం', నవంబర్ 2006*

*- 'తెలంగాణ అభివృద్ధి - మిథ్య - వాస్తవం', నవంబర్ 2006*

# తెలుగుతల్లి - తెలంగాణ తల్లి

ఎట్టకేలకు 'తెలుగుతల్లి' చర్చ మొదలైంది. కెసిఆర్ ఒక్క మాటతో బిడ్డల గుండెలు కలవరపడ్డాయి. తెలుగుజాతి, తెలుగుతల్లి భావన కృత్రిమమైందని, అవసరాల రీత్యా కల్పించబడిందని తెలంగాణ వాదులు తొమ్మిదేళ్ళుగా చెప్పుకొస్తున్నా పట్టించుకోని వాళ్ళు రాజకీయ స్వరంలో వినిపించేసరికి రచ్చచేస్తున్నారు. ఎప్పటికైనా తెలుగుతల్లి చరిత్ర తేలాల్సిందే. దబాయింపు ఏ చర్చకైనా మంచిదికాదు. జాతి భావన, మాతృభావన, ప్రాంత భావన కాల సందర్భాల్లోంచి రూపొందుతుంది. చారిత్రక అవసరాల కనుగుణంగా ఆయా భావనల ప్రాధాన్యత మారుతూ ఉంటుంది. భావోద్వేగాలు నిజమే అయినా పరిస్థితుల తోడ్పాటు లేకపోతే ఏ భావం ఉద్వేగస్థాయికి చేరుకోలేదు. ఎవరికైనా 'భావన' తయారు చేయటం, తారుమారు చేయటం సులభం కాదు. తగిన పునాది ఉండాలి.

పుట్టిన నేలను గౌరవించడం తల్లిగానో, తండ్రిగానో సంభావించడం పురాతనకాలం నుంచి అన్ని ప్రాంతాల్లో ఉన్నదే. ఆ నేల పొలిమేరలు మాత్రం ఇప్పటివికావు. ఆ తల్లిపేరు, వివరం ఇప్పుడు వర్ణిస్తున్నది కాదు. ప్రాచీన సంస్కృత సాహిత్యంలో భారతమాత వర్ణన కనిపించదు. వాల్మీకి వర్ణించిన జనని భారత జనని కాదు. 'జనని సంస్కృతంబు సకల భాషలకు' అంటే చాలా భాషలు ఒప్పుకోవు. 'వందేమాతరం' ఇటీవలి కాలానిది. బంకించంద్రుని దృష్టిలో ఆ మాత కాళీమాతే. ఒకానొక సందర్భం కుదిరి భారతదేశాన్ని ఉగ్రరూతలూగించింది. జాతీయగీతంలోని 'భారత భాగ్యవిధాత' 'అధినాయకుడు' ఎవరు? భారతపితా? భారత సుతుడా? చెప్పలేకపోవచ్చు. ఇంకెవరో కూడా నిరూపించలేం. 'తెలుగుతల్లి' విషయంలో అట్లాకాదు. సందర్భం స్పష్టం. చరిత్ర సుస్పష్టం. ఇరవయోశతాబ్ది ఆరంభమే ఆంధ్రోద్యమానికి బీజాలు వేసింది. అప్పటివరకు జాతి భావన, మాతృభావన లేదు. 1905లో 'వందేమాతరం' ఉద్యమమే జాతిభావన మేలుకొల్పింది. మదరాసు రాష్ట్రంలో ఆంధ్రులు పడుతున్న అవస్థలే జాతిభావనకు మూలమయ్యాయి. గుంటూరులో 'యంగ్‌మెన్ లిటరరీ అసోసియేషన్' ఏర్పాటైంది. జొన్నవిత్తుల గుర్నాథం 'హిందూ' పత్రికలో వ్యాసాలు రాసి ఆంధ్రోద్యమానికి అంకురార్పణచేశాడు. ఆంధ్ర జాతి భావననిర్మాణం కోసం 1907లో చరిత్ర 'తవ్వకం' పని ప్రారంభించి విజ్ఞాన చంద్రికా మండలి 1910లో 'ఆంధ్రుల చరిత్ర' ప్రచురించేనాటికి, 1910లో తమిళుల, ఆంధ్రుల ఉద్యోగాల గణాంకాలు ప్రచురించేనాటికి కూడా 'తల్లి' ఏర్పడలేదు. మొదటిసారి ముట్నూరు కృష్ణారావు 1913 మే 24 కృష్ణాపత్రిక సంపాదకీయం 'మాతృసందర్శనము'లో 'ఆంధ్రమాత'ను ఆవిష్కరించాడు. 'భరతమాత ముద్దుకొమరిత యగుచు/అలరి మన ఆంధ్రమాత వర్ధిల్లెడుగాత', 'ఆంధ్రమాత' తల్లి 'భరతమాత' అని కూడా తెలిపాడు. 1914లో గడ్డం కొండారెడ్డి 'ఆంధ్రమాతృస్తవము' శీర్షికన పద్యాలు రాశాడు. 'తల్లి' రూపొందినా ఆంధ్రజనుల్లో ఆ భావన అందుకోలేదు. 'నాదు జాతి నా దేశము నాదుభాష/ అను అహంకార దర్శనమందు మాంధ్ర' అని రాయప్రోలు 'ఆంధ్ర' శీర్షికతో పద్యాలు రాశాడు. ఆంధ్రబిడ్డడిని అహంకార దర్శనం సంతరించుకొమ్మని ప్రబోధించాడు. చివరకు 'శ్రీ' అనే రచయిత అహంకార దర్శనము చేసి 'భారత-ఛీ-కాదు ఆంధ్రమాత'కు జై' అని రాశాడు. ఆ తర్వాత ఆంధ్రోద్యమంలో రాయలసీమ వారిని కలుపుకోవాల్సిన పరిస్థితి అనివార్యమైంది. ఆ సందర్భంలో 'ఆంధ్రమాత' తెలుగుతల్లిగా రూపాంతరం చెందింది. తిరిగి రాయప్రోలు 'తెనుగుతల్లి' పద్యాలు రాశాడు. 'మన మండలంబున మన తల్లి వేఅవసియింపగా గృహము కట్టింపవలయు'నని తిరుపతి వేంకట కవులు స్పష్టించారు.

ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కొరకు ఆంధ్రోద్యమం, ఆంధ్రోద్యమ నిర్మాణం కొరకు 'ఆంధ్రమాత,' 'తెలుగుతల్లి' ఉనికిలోకి వచ్చారు. ఈ పరిణామాలతో, భావోద్వేగాలతో తెలంగాణకు సంబంధం లేదు. అయినా - ఈ తల్లుల్ని తెలంగాణ నిరాకరించలేదు. తిరుపతి వేంకటకవులు తల్లికి 'గృహము కట్టింపవలయు'నని తలపోశారు గాని ఇంకొకరి గృహములో ఉంచుమని కోరలేదు. ఆంధ్రులు మదరాసు నగరాన్ని విడిచిపెట్టి హైదరాబాద్ నగరాన్ని వశపరచుకున్నారు. ఆనాడు పొట్టిశ్రీరాములు మదరాసు నగరాన్ని కేంద్రపాలిత ప్రాంతంగా చేయాలని కోరాడు. అచ్చం అట్లాగే ఇవాళ హైదరాబాద్ నగరాన్ని కేంద్రపాలిత ప్రాంతంగా ప్రకటించాలని ఈ నగరాంధ్ర ప్రముఖులు కోరుతున్నారు. పుత్రుల కోరికను 'ఆంధ్రమాత' మన్నించింది. 'తెలుగుతల్లి' మన్నిస్తుంది. 'తెలంగాణతల్లి' మన్నించదు.

భారతమాతను ఆంధ్రకవి 'ఛీ'కొట్టినా చెల్లింది. ఇంత భావోద్వేగంలోనూ ఏ తెలంగాణీయుడు భారతమాతను ఆక్షేపించలేదు. ప్రఖ్యాత ఆంధ్రకవి తుమ్మల అరవలను

'దోమలని' 'పాలలో బడిన బల్లుల'ని తూలనాడినా సంస్కారంగా చలామణి అయింది. ఇంతస్థితిలోనూ తెలంగాణ కవులు అట్లా తిరస్కారంగా మాట్లాడకపోయినా సంస్కారం కాదు. అగస్త్యుడు ప్రథమాంధ్రుడని, వాల్మీకి ఆంధ్రదేశంలోనే పుట్టినాడని రాసుకున్నా అది చరిత్ర అయింది. రాజరాజ నరేంద్రుడితోగాని, కృష్ణదేవరాయలతోగాని తెలంగాణకు సంబంధం లేదని రాస్తేనో, తెలంగాణ ఆంధ్ర రెండు వేర్వేరు జాతులని రాస్తేనో, కనీసం వేర్వేరు పాలనల్లో ఉన్నాయని రాస్తేనో చరిత్రను తారుమారు చేసినట్టవుతుంది.

ఆంధ్రప్రదేశ్ అవతరణతో తెలుగుతల్లి అవసరం తీరిపోయింది. కొంతకాలం మూలనుంచారు. అవమానాలు తట్టుకోలేక 1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం మొదలయినప్పుడు తెలుగుతల్లిని బయటకు ప్రవేశపెట్టారు. ఆ తర్వాత కొంతకాలానికి కేంద్రసర్కారుతో తేల్చుకోవాల్సివస్తే స్వాభిమానాన్ని, సాధికారాన్ని సాధించుకోవడానికి తెలుగుతల్లిని ఊరేగించారు. కోరిన వరాలిచ్చినందుకు కృతజ్ఞతగా ఎన్‌టిఆర్ విగ్రహం చెక్కించి ప్రతిష్ఠించాడు. ఇంత చరిత్ర 'తెలుగుతల్లిది'. ఈ చరిత్రంతా లక్ష్యపెట్టకుండా కెసిఆర్ తెలుగుతల్లిని దిక్కుమాలిన తల్లి అన్నాడు. ఇప్పటి తెలంగాణ ఉద్యమాన్ని అణచటానికి తెలుగుతల్లినే ప్రయోగిస్తున్నారు కనుక అట్లా అనవలసి వచ్చింది. మామ పెట్టించిన విగ్రహం అల్లుడు హైటెక్ అభివృద్ధిలో భాగంగా తొలగించినప్పుడు ఆ తల్లి నిజంగా దిక్కుమాలినదయింది... అపుడు పట్టించుకోని తనయులు దిక్కుమాలిన తల్లి అనగానే ఎగిసిపడ్డారు. ఇది తెలుగుతల్లిమీద ప్రేమకాదు. తెలంగాణ తల్లిమీద అసహనం. నెహ్రూ పేర్కొన్న సామ్రాజ్యం చేజారిపోతుందన్న అసహనం.

*- ఆంధ్రజ్యోతి - వివిధ, 30 అక్టోబర్ 2006*

*- మన తెలంగాణ, నవంబర్ 2006*

*- 'తెలంగాణ ఆకాంక్ష - కరీంనగర్ సందర్భం' నవంబర్ 2006*



# మానవ సంబంధాల మహోత్తేజం బతుకమ్మపండుగ

తెలుగువారిలో తెలంగాణ ప్రజలు ఎన్నో సాంస్కృతిక ప్రత్యేకతలు కలిగి ఉన్నారు. భాష, యాస, ఆచారాలు, పండుగలు, ఆహారాది విషయాల్లో తమదైన జానపద ముద్రను కాపాడుకోవటం విశేషం. వీళ్లది 'దేశీ' సంప్రదాయం. మంది సంస్కృతి. ప్రకృతే ఆదరువు. వ్యవసాయం ప్రధానమైన బతుకు దెరువు. అందువల్ల బతుకులు చల్లగా చూడమని నిరంతరం ప్రకృతిని కొలుస్తారు. పండుగలుచేస్తారు.

తెలంగాణ సాంస్కృతిక చిహ్నాలయిన బోనాలు, బొడ్డెమ్మ, బతుకమ్మ, దసరా, కాట్రావులు, హోళీ, పీరీలు పండుగలు వ్యవసాయం, ప్రకృతి చుట్టూ అల్లుకొని రూపొందినవే. 'అలుకు'నాడు చేసే 'బోనం' మొదలు 'పశువుల'కు చేసే కాట్రావుల దాంకా బతుకుదెరువుతో ముడిపడిన పండుగలే.

చూడ్డానికి బతుకమ్మ స్త్రీల పండుగ గాను, దసరా మగవాళ్ల పండుగగాను కనిపిస్తయి గానీ సందడి ఇద్దరిదీ. ఈ పండగలొస్తున్నయంటేనే నెలరోజుల ముందే పల్లెల నిండా ఏర్పాట్లు, ప్రయాణాలు మొదలయితయి. పల్లెలు, పేటలు, పట్టణాలు పండుగ రోజుల్లో సంబురం పోతపోసుకున్నట్టు హుషారు పడుతుంటయి.

స్థానిక ప్రజలకు భాద్రపద అమావాస్య చాలాప్రాముఖ్యమైంది. 'పెద్దల అమావాస్య' అనే 'పెత్తరమాస' అని పిలుచుకునే ఈ రోజు గౌరవమైనది. పనుల హడావుడిలో తీరది గనుక, వేర్వేరు తిథులు దినాలు గుర్తుపెట్టుకోవటం కష్టం గనుక ఒకరోజు అనుకొని అందరూ తమ పెద్దలకు, పితృలకు పండుగ చేస్తారు. బియ్యం దానమివ్వటం, ఇష్టమైన వంటలు వొండిపెట్టటం, వొచ్చేవాళ్లతో పొయ్యేవాళ్లతో పల్లెటూళ్లల్లో పండుగ జరుగుతుంది.

పల్లెసంబరం 'బొడ్డెమ్మల పండుగ' తో మొదలవుతుంది. నిజానికి - ఈ ప్రాంతవాసులకు ఇది ఒక పండుగ కాదు. నాలుగు పండుగల కలయిక. బొడ్డెమ్మ పండుగ, పెద్దల పండుగ, బతుకమ్మ పండుగ, దసర పండుగ నాలుగు వరుసగా జరుపుతారు. ఒక రోజు సంబురం

కాదు. దాదాపు ఇరవైరోజుల సంబురాలు. అందుకే ఈ ప్రాంతంలో ఈ పండుగలకింత ప్రత్యేకత .

భాద్రపద పంచమి రోజున మగవాళ్లు వెళ్లి 'పుట్టమన్ను' తెస్తారు. ఇక్కడి ప్రజల సంస్కృతిలో 'పుట్టమన్ను'కు ప్రత్యేకస్థానం ఉంటుంది. ఇంట్లో కొత్త పొయ్యి వెయ్యటానికి కూడా పుట్టమన్నే వాడుతారు. దుర్గమ్మ పండుగకు 'పుట్టమన్ను' తెస్తారు. పుట్టమన్ను తడిపి ఒకచిన్న పీటమీద చతురస్రాకారంలో గుడి గోపురం మాది అంతురాలు చేస్తారు. వాటికి వరుసగా రంధ్రాలుంటాయి. పీటకు నాలుగు దిక్కులా నాలుగు చదరపు ముద్దలుంటాయి. వాటికి ఒక్కొక్క రంధ్రముంటుంది దీన్ని 'బొడ్డెమ్మ' అంటారు. 'బొడ్డె' అంటే చిన్నకుప్ప లేదా రాశి. 'బొడ్డె' అమ్మ. 'బొడ్డెమ్మ'. నిజానికి ఒకరకంగా ఇది మట్టిపూజ. ఉత్పత్తి (పంటలు), పునరుత్పత్తి (సంతానం) సవ్యంగా జరగాలని చేసే పూజ. సాయంత్రం బొడ్డెమ్మను 'అలుకు' తోగానీ 'జాజు'తో గానీ పుదిస్తారు. మట్టి రంధ్రాలలో రంగు రంగుల రుద్రాక్ష, గోరింట, మద్దాన్నపూలు పెట్టి అలంకరిస్తారు. సంధ్యవేళ కూడలిలోనో, పెద్దవాకిట్లోనో నడుమ పేడతో అలికి ముగ్గులేస్తారు. మధ్యలో బొడ్డెమ్మలన్నీ పెట్టి చుట్టూ తిరుగుతూ పెళ్లీడు ఆడపిల్లలు ఆడుతారు.

*"బొడ్డెమ్మ బొడ్డెమ్మ కోల్ బిడ్డాలెందరే కోల్*
*నీ బిడ్డపేరేమె కోల్ నిండా నూరేళ్లే కోల్"*

చీకటి పడిందాకా ఆడి 'బొడ్డెమ్మ'లు తీస్తారు. "నిదురపో బొడ్డెమ్మా నిదురపోవమ్మ, నిద్రకు నూరేళ్లు నీకు వెయ్యేళ్లు" అని పాటల్తో నిద్ర పుచ్చి ఎవరింటికి వాళ్లు తీసుకెళ్తారు. ప్రతి సాయంత్రం ఇట్లా కొత్త అలుకురాసి కొత్త పూలు అలంకరించి తొమ్మిది రోజులు పండుగ చేస్తారు.చివరి రోజు ఆట తర్వాత బొడ్డెమ్మలు బావిలో వేస్తారు.

జానపద స్త్రీల సామూహిక నృత్యాల్లో తెలంగాణ ప్రాంతంలోని 'చుట్టుగముడు' మౌలికమైంది. ప్రాచీనమైంది. గుమికూడిన స్త్రీలు ఒకరినొకరు ఆనుకొని, వంగుతూ లేస్తూ, ఒక లయలో చప్పట్లుకొడుతూ వలయాకారంగా తిరుగుతూ పాట ఒకరు చెప్తుతుంటే మిగతా వాళ్లంతా దాన్ని తిరిగి అంటారు. అనేక నృత్యాలకు ఇది 'తొలిరూపమై' ఉండాలి. వాద్యసాధనాలు రూపొందక ముందు పుట్టిన జానపద నాట్యరూపం కావొచ్చు. మానవాంగాలలోనే పాట - ఆట - దరువు కలిగలిసిన కళారూపం 'చుట్టుగముడు'. వానాకాలం వానపడక పోతే నడిరాత్రిదాంకా వరుసగా చాలా రాత్రులు ఈ నాట్యంతో



వానదేవున్ని వేడుకుంటారు. మంచి కాపురాన్ని ఇవ్వుమని, మంచి సంతానాన్నివ్వుమని 'ఉత్పత్తి' రూపమైన మట్టిని బొడ్డెమ్మను కొలుస్తారు. పంటలను, బతుకులను కాపాడమని పూలప్రతీకగా 'బతుకమ్మ'ను ప్రార్థిస్తారు. ఇట్లాంటి వేడుకలన్నిటికి 'చుట్టుగముడే' మూలం. సందర్భాన్ని బట్టి, చిన్నచిన్న మార్పులతో నృత్య వైవిధ్యాన్ని సృష్టించి ఆడుతారు. పాడుతారు.

తెలంగాణలో 'బతుకమ్మ' గొప్పవేడుక. అచ్చంగా జానపదుల పండుగ. ప్రాచీనమైన పండుగ. ఇటీవల కొన్ని సంవత్సరాలుగా శతాబ్ది కాలంగా నాగరికుల దృష్టిని ఆకర్షించి ఆదరణ పొందుతున్నది. పరిశోధనల్లో కెక్కుతున్నది. కావ్యాల్లోనో చరిత్ర పుస్తకాల్లోనో పేర్కొనక పోయినంత మాత్రాన బతుకమ్మను ఇటీవలి పండుగగా నిర్ధారించటం సహేతుకం కాదు. అనేక అంశాలు చరిత్రలో స్థానం పొందకపోవటానికి రకరకాల కారణాలుంటాయి. జానపదుల కెంతో ఆరాధనీయమైన 'తంగెడు పూల'ను కవులు, నాగరికులు పట్టించుకోలేదు. కింది కులాల స్త్రీలు మాత్రమే తలలో పెట్టుకోవటం ఇప్పటికీ గమనించవచ్చు. కింది కులాల వాళ్లు తంగెడు చెక్కను వృత్తిపనుల్లో ఎక్కువగా వాడుతారు. ఈ ప్రాంతంలో పుష్కలంగా కనిపించే 'తంగెడుపువ్వు' కవులు పండితులు కనీసం పుష్పవిశేషాల్లో కూడా అంతగా పేర్కొననంత మాత్రాన ఈ పూలు ఇటీవలివని చెప్పలేం. ఒక్కో సందర్భంలో ఒక్కోపుష్పానికి ఒక్కోవేడుకకు ప్రాచుర్యం లభించిన దృష్టాంతాలెన్నో ఉన్నాయి.

బతుకమ్మ పండుగ ఆవిర్భావానికి సంబంధించి కాలనిర్ధారణ చేయటం కష్టం. జానపద రచనను ఆచారానికి కాలనిర్ధారణ చేయటానికి ఇప్పుడున్న ఆకరాలు మాత్రమే సరిపోవు. అయితే - పండుగ నేపథ్యాన్ని వివరించే నాలుగైదు కథనాలు బహుళ ప్రచారంలో ఉన్నాయి. బతుకమ్మ పాటల రూపంలోనే ఉన్నాయి.

ఒకటి పౌరాణికం. శ్రీగౌరి మహిషాసురుని చంపిన తర్వాత (ఆశ్వీయుజ శుద్ధ పాడ్యమి నాడు) అలసటతో మూర్ఛపోయింది. ఆ మూర్ఛనుంచి ఆమెను తేర్చటానికి స్త్రీలంతా గుమిగూడి పాటలు పాడినారు. సరిగ్గా పదవరోజున ఆమె మూర్ఛనుంచి తేరుకొని స్పృహలోకి వొచ్చింది. మూర్ఛలోని ఆమెను తిరిగి 'బతుకమ్మా' అని పాడితే బతికింది గనుక ఆ పదిరోజులు పండుగ జరుపుకొంటారు.

రెండోది చారిత్రక గాథ. చోళదేశాన్ని ధర్మాంగదుడనే రాజు పాలించేవాడు. అతని భార్య సత్యవతి. వాళ్లకు నూరుగురు కొడుకులు. యుద్ధంలో అందరూ చనిపోయారు. వారు దుఃఖించి అడవులకు వెళ్లి సంతానం కోసం లక్ష్మీదేవినుద్దేశించి తపస్సు చేశారు. లక్ష్మీదేవి ప్రత్యక్షమై వరమడుగుమంటే ఆమెనే తమ కూతురుగా జన్మించుమని కోరినారు.

వాళ్లకు జన్మించిన లక్ష్మీదేవిని మునులు సందర్శించి 'బతుకమ్మ' అని పేరుపెట్టి ఉత్సవం జరిపించారు. యౌవనవతి అయిన 'బతుకమ్మ'ను చక్రాంకుడిపేరున వెలిసి శ్రీమహావిష్ణువు పెండ్లాడి సంతానం పొందారు. అప్పటినుండి 'బతుకమ్మ' పేరుమీద ఈ పండుగ జరుపుకొంటారు.

మూడోది సామాజికం. కొన్ని శతాబ్దాల కిందట ఈ ప్రాంతంలో కరువుకాటకాలు, భయంకర వ్యాధులు సోకి చాలామంది ప్రాణాలు కోల్పోయారు. పల్లెలన్నీ ఆపసోపాలు పడ్డాయి. ఆ తిప్పలనుంచి తమప్రాణాలు కాపాడుమని, బతుకునిమ్మని ప్రజలు పండుగ చేశారు. బతుకు నిలిపిన దేవతే 'బతుకమ్మ' - మరో కథ. చాలా ఏళ్ల తర్వాత వానలు కురిసి చెరువుకట్ట తెగిపోయింది. గండిపూడ్చటానికి గ్రామప్రజలు ఎంత ప్రయత్నించినా వీలుకాలేదు. విఫలమయ్యారు. కన్యగా ఉన్న బతుకమ్మ గండి పడిన చోట బలికి సిద్ధపడి ఊరి ప్రజలను బతికించింది. ఆటపాటల్తో ఆమెను ఆరాధించటమే బతుకమ్మ పండుగ.

ఐదోది కౌటుంబికం. పూర్వం ఓ కాపు దంపతులకు పుట్టిన పిల్లలు పుట్టిన వెంటనే చనిపోసాగారు. వారి ఎనిమిదో సంతానం ఆడపిల్లకు 'బతుకమ్మ' అని పేరుపెట్టుకున్నారు. పాప బతికింది. పెరిగి పెద్దయిన ఆమెకు పెళ్లిచేసి అత్తవారింటికి పంపించారు. ఏడాది తర్వాత ఆమె పుట్టింటికి వచ్చినపుడు ఆమె వదినతో కలిసి చెరువుస్నానానికి వెళ్లింది. చీరల విషయంలో గొడవపడిన వదిన, మరదలు బతుకమ్మను చంపేసి ఆ మృతదేహాన్ని తంగెడు పొదల్లో పాతి పెట్టింది. వృత్తాంతమంతా తెలిసిన ప్రజలు కంటతడిపెట్టి తంగేడు పూలతో ఆమె పేరుమీద శాంతి పూజలు చేశారు. అదే 'బతుకమ్మ' పండుగగా నిలిచిపోయింది. మరికొన్ని కథలు కూడా అక్కడక్కడా ప్రచారంలో ఉన్నాయి.

'బతుకమ్మ' పండుగ తెలంగాణ సాంస్కృతిక దర్పణంగా ప్రాచుర్యం పొందింది. 'పెత్తరమాస' రోజున బతుకమ్మ మొదటి రోజు 'ఎంగిలి పూలు' అంటారు. పెరట్లో ఇంటిచుట్టూ దొరికే పూలు 'తబుకు'లో పేరుస్తారు. హారతి పళ్లాన్ని తెలంగాణలో 'తబుకు' అంటారు.

బతుకమ్మ పండుగకు ఆడబిడ్డలందర్నీ పుట్టింటికి తోలుకొస్తారు. వ్యవసాయపనుల్లో, ఇంటి పనుల్లో, అత్తింటి ఆరళ్ళలో అలసిసొలసే ఆడవాళ్లకు తల్లిగారి పిలుపులు పెద్దఊరట. పుట్టినిల్లు పెద్దవిరామం. పుట్టినింటిలో, పెరిగిన ఊరిలో, తిరిగిన బాల్యస్నేహితుల జ్ఞాపకాలు, పరామర్శలు, ఆదరాలు గత ఇబ్బందుల్ని మరిపించి మురిపిస్తాయి. ఉత్సాహపరుస్తాయి. తోటి ఆడవాళ్లంతా వస్తారు గనుక బతుకమ్మ పండుగంటే ఆడబిడ్డలకు ముచ్చట్లే ముచ్చట్లు.



సందడే సందడి. యేడాది భారమంతా దించుకునే గొప్పఅవకాశం. అందుకనే - ఎంత నిరుపేద కుటుంబాలయినాసరే తప్పకుండా అన్నలో, నాయినలో వెళ్లి తమ ఆడబిడ్డల్ని తోలుకొచ్చుకుంటారు. తల్లిదండ్రుల, అన్నదమ్ములతో ఆడబిడ్డల ప్రేమబంధాన్ని గట్టిపరిచే సందర్భం. బొడ్డెమ్మలు, ఎంగిలిపూలు మొదలు ఆడపిల్లల సంబరమే ఇల్లంతా, ఊరంతా నిండుతుంది.

బతుకమ్మ రెండోరోజునుంచి కుటుంబంలోని మగపిల్లలు పువ్వు తేవటానికి కంచెకు వెళ్ళుతారు. ప్రతిరోజు మబ్బుల తెల్లవారక ముందే అరికంట్లం (చలినుంచి రక్షణ కోసం ధరించే పాతబట్ట) కట్టుకొని చిన్న పిల్లలు తట్టలు, ఎలితె గంపలు సంకల పెట్టుకోని పోయి పూలవేట మొదలుపెడతారు. మంచు చినుకుల మధ్యన బంగారు ఛాయలో తంగెడు పువ్వు గనబడుతూనే పోటీపడి పరుగెత్తి పువ్వుతెంపుతారు. తంగెడు పువ్వు గునుగు పువ్వుతో గంప నింపుకోని ఇంటికొస్తారు. మధ్యాహ్నం స్త్రీలు ముక్కాలి పీటమీద తబుకు పెట్టి, తబుకులో బీర, గుమ్మడాకు పరిచి అంచులు చుంచివేసి తంగెడు తర్వాత గునుగు పూలను శిఖరం లాగా పేరుస్తారు.

సాయంత్రం ఆడవాళ్లు తయారై కొత్తచీరెలు కట్టుకోని బతుకమ్మతో పసుపు గౌరమ్మపెట్టి పట్టుకొని బయల్దేరతారు. గుడిప్రాంగణంలోనో వీధి కూడలిలోనో నడుమ తెచ్చిన బతుకమ్మలు పెట్టి బతుకమ్మల చుట్టూ గుండ్రంగా తిరుగుతూ చప్పట్లు కొడుతూ పాటలందుకుంటారు. మధ్యమధ్య పక్కనచేరి ముచ్చట్లు పెట్టుకొని వెళ్లి మళ్లీ ఆటపడుతుంటారు. జేబులలో ప్రసాదం మూటలు పెట్టుకొని మగపిల్లలు ఆటచూస్తూ అటూ ఇటూ తిరుగుతుంటారు. గంతులేస్తుంటారు. చీకటి పడేదాకా ఆడి 'బతుకమ్మ'లు పట్టుకొని చెరువు దనుక గుంపులు గుంపులుగా వెళ్లి అప్పటికే నీళ్ల ఒడ్డున నిలుచోని ఉన్న మగవాళ్లకందిస్తారు. వాళ్లు మోకాళ్లలోతు నీళ్లదాకా వెళ్లి ఒడుపుగా తబుకు తీసి 'బతుకమ్మ'ను నీళ్లలో వదిలి వస్తారు. ఆడవాళ్లు గౌరమ్మ పాటలు పాడుతూ వొచ్చి, తెచ్చిన ప్రసాదం పప్పులు ఫలహారాలు తబుకుల్లో పోసి ఒకరికొకరు వాయనాలు పంచుకుంటారు. పెసరపప్పు, శర్కర, మక్కగింజ శర్కర, కందిపప్పు, బెల్లం, పుట్నాలు, దానిమ్మగింజలు మొదలైన ప్రసాదాల కోసం మగపిల్లలు చుట్టూ మూగి సందడి చేస్తారు. అందరిదగ్గర అడిగితీసుకొని రుచులు పరీక్షించటం, చమత్కరించటం వాళ్లకో సరదా.

ఇట్లా అయిదురోజులు హుషారుగా సాగిపోతుంది. ఆరోరోజు అర్రెం. బతుకమ్మలు పేర్వరు. పనులు చూసుకోవటానికి, యాంత్రికం కాకుండా ఒకరోజు విరామం. ఏడో ఎనిమిదో

రోజులు మరింత హుషారు. తొమ్మిదోరోజు బతుకమ్మ కోసం మగవాళ్లు, నేర్పరులు కాగితం పూలు తయారు చేస్తుంటారు. ఒకపొడుగైన గట్టి వెదురుపుల్లను చెక్కి గుండ్రటి రేకుగానీ అట్టగానీ అడుగున తగిలిస్తారు. రేకుకు చుట్టూ రంధ్రాలు చేసి అందులో సన్నవెదురు పుల్లల్ని ఏటవాలుగా శిఖరం దగ్గర కలిపి దారంతో కడుతారు. పైనుంచి కాగితాలు అంటిస్తారు. దానిమీద ప్రత్యేకంగా డిజైన్‌చేసి కత్తిరించి తయారుచేసిన రంగుకాయిదాల పూలను ఒకరంగు తర్వాత మరోరంగుని వరుసగా అతికిస్తారు. అచ్చం పూల శిఖరం పేర్చినట్లు తయారు చేస్తారు. అవసరం అనుకుంటే శిఖరం మీద మరో ఆకర్షణ గుత్తి.

ఇట్లా ఉండగా చాలామంది మగవాళ్లు తొమ్మిదో రోజు "పెద్దబతుకమ్మ" కోసం ఒకరోజు ముందుగానే గడ్డిపువ్వు, గునుగుపువ్వుతెచ్చి తగినట్లుగా కోసి కట్టలుకట్టి పెట్టుకుంటారు. తొమ్మిదోరోజు బతుకమ్మను "పెద్దబతుకమ్మ" అనీ "సద్దుల బతుకమ్మ" అనీ అంటారు. తెల్లవారితే పెద్దబతుకమ్మఅనగా అర్ధరాత్రికే వెళ్లి తంగెడు చెట్ల దగ్గరే పడుకొంటారు. కొందరు. జామురాత్రి నుంచే పువ్వుకోసం పోటీపడతారు. గంపలల్లో బస్తాలల్లో తంగెడు పువ్వు, గునుగుపువ్వు నింపుకొస్తారు. పట్టణాల్లో అయితే ఈ తొమ్మిది రోజులూ తంగెడు పువ్వు ఇల్లిల్లు తిరిగి అమ్ముతారు. మార్కెట్లో కూడా ఈ పూలు అమ్ముతారు. చిత్రమేమంటే అసలు పూలు పల్లెలనుంచి తెచ్చి పట్టణాల్లో అమ్ముతారు.కాగితం మెరుపుల పూలు పట్టణాల్లో కొనుక్కొని పల్లెలకు తీసుకపోతారు.

సద్దుల బతుకమ్మరోజు కొంచెం పొద్దుకాగానే 'బతుకమ్మ' పేర్చటానికి కూచుంటారు. ఇంటిల్లిపాదీ ఆడామగా, చిన్నాపెద్దా అందరూ పువ్వు ఏరుతారు. సాధారణంగా పెద్దబతుకమ్మను మగవాళ్లే పేరుస్తారు.

ముక్కాలిపీట. దానిమీద పెద్ద తాంబాలం. దానిమీద గుమ్మడిఆకులు పరిచి సమత్రంగా కత్తిరించివేసి తంగెడు పువ్వు పేరుస్తారు. తంగెడు పువ్వుతోనే బతుకమ్మఎత్తుపెంచుతారు. నడుమ (పొట్టలో) ఉనుకగానీ, తంగెడు తుక్కుగానీ నింపుతారు. గునుగు సమత్రంగా కోసి ఇస్తుంటే కొంత ఎత్తు పేర్చి తర్వాత గునుగు రంగుల్లో అద్ది పేర్చుతుంటే మొఖమల్ లాగా కన్పిస్తుంది. తర్వాత గడ్డిపువ్వు వరుస. రంగులు అద్ది మరిన్నివరుసలు పేరుస్తారు. రోకలి బండపువ్వు, ఆడవిశామంతి, కట్లెపువ్వు, గోరింట, గన్నేరు తీరొక్క పూలను పేర్చి పైన కాగితం పువ్వు కిరీటంలా పెడతారు. పిల్లాడిలా నిలువెత్తు బతుకమ్మ. ఇంట్లో అలికి ముగ్గుపెట్టి పీటవేసి అక్కడపెడతారు. అప్పటికే వంటింట్లో ఆడవాళ్లు మలీదముద్దలు (వరి, సజ్జ, రొట్టెలు తునకలుచేసి శర్కర పాకంలో పిసికి ముద్దలు చేస్తారు. అవే 'మలీద'లు)



రకరకాల సద్దులు తయారుచేస్తారు. పులుసుకలిపిన సద్ది, పెరుగుకలిపిన సద్ది కాపు కుటుంబాల్లో రెండేసుద్దులు. కోమట్లు పెసర, కొబ్బరి, పుట్నాలు, నువ్వుల, పల్లీల, బియ్యం పొడులు కలిపి తయారుచేసిన తొమ్మిది రకాల సద్దులు బతుకమ్మ ముందుపెడతారు. అగరువత్తులు ముట్టించి 'బతుకమ్మ'పూల మధ్యలోచెక్కుతారు. కొత్త చీరలు కట్టుకొని తయారైన స్త్రీలు పెద్ద బతుకమ్మ పక్కన చిన్నబతుకమ్మలో పసుపు ముద్దులుంచి తెచ్చిపెడతారు. వాటి చుట్టూ ఇంట్లో ముందుగా ఆడతారు. వంటలు సమర్పిస్తారు. మొక్కుకుంటారు.

అప్పటికి మధ్యాహ్నం నుంచే తమ్మలి వాయిద్యంతో వీధివీధి తిరుగుతాడు. సాయంత్రం 4గం॥ కల్లా రకరకాల వాయిద్యాలతో బ్యాండ్‌తో పెద్ద బతుకమ్మలు బయల్దేరతాయి. పెద్దబతుకమ్మలు సాధారణంగా మగవాళ్లు నెత్తిమీద పెట్టుకొని నడుస్తుంటే స్త్రీలు చిన్న బతుకమ్మలు (గౌరమ్మ) ను చేతిలో పట్టుకొని నడుస్తారు. ఊరంతా పెద్దహడావుడిగా ఉంటుంది. ప్రతిబజారు, ప్రతి కూడలి, ప్రతివాడా రంగులతో పాటలతో ఆటలతో ముచ్చట్లతో హోరెత్తుతుంటుంది ప్రాముఖ్యకేంద్రంలో ముఖ్యకులాలవాళ్లు, తమ తమ వాడల కూడళ్లలో మిగతాకులాలు బతుకమ్మలు ఉంచి సంబురంగా ఆడుతారు. మంది పెరిగిన చోట నాలుగైదు బృందాలు ఏర్పడి ఆడుతారు. గ్రామ ప్రముఖులు బృందంగా బతుకమ్మలు దర్శించి అంచనా లేస్తారు. కొన్ని గ్రామాల్లో కొన్ని పట్టణాల్లో ఈ పండుగ ఘనంగా వైభవంగా జరగటంవల్ల తక్కిన గ్రామాలవాళ్లు ఏడొద్దులకే పండుగ చేసుకొని చూడటానికి వెళ్లే సందర్భాలు కూడా ఉంటాయి.

చీకటి పడి తనవి తీరేదాంకా ఆడినతర్వాత తమ్మలి వాద్యసహకారంతో బతుకమ్మలు తలల మీద ఊరేగుతాయి. అంతకు ముందే యువకులు పెద్దలు చెరువుకట్ట పొడుగునా బారులు తీరిఉంటారు. కొందరు ఉత్సాహవంతులు, యువకులు, సేవకులు చెరువునీళ్లలోకి దిగి లోతుదాకా వెళ్లి బతుకమ్మలు వదులుతారు. తాంబాలం వెనక్కితెస్తారు. సందెచీకట్ల మధ్య చెరువునీటి మట్టం మీద బతుకమ్మలు తేలియాడుతుంటే అలలు సృష్టించి ముందుకు జరుపుతుంటే అదొక ఉద్వేగం. పట్టరాని పరవశం. చిన్న బతుకమ్మలు కూడా నీటిలో విడిచిపెడతారు. తబుకులతో తడికాళ్లతో నడుస్తూ స్త్రీలు బతుకమ్మను సాగనంపుతారు.

"పోయిరా బతుకమ్మ పోయిరావమ్మ
మల్లొచ్చె యాడాది తిరిగి రావమ్మా"
అంటూ

శ్రీలక్ష్మి నీమహిమలు గౌరమ్మ చిత్రమై తోచునమ్మా
ఎన్నెన్నొ రూపముల - ఏడేడు లోకముల
ఉన్న జనులకు కోర్కెలన్ని సమకూర్చేవు"

అనిపాడుతారు. తెచ్చిన ప్రసాదాలు ఫలహారాలు తబుకులో పోసి ఒక్కదగ్గర అందరూ కూడుతారు. గుంపుగుంపు కలిసి మరింత సందడిగా ఉంటుంది. ప్రసాదాలు అందరికి పంచుకుంటూ నవ్వుతూ తుళ్లుతూ పరాచికాలతో పరవశిస్తుంటారు. మగపిల్లలు ప్రసాదం కోసం వెంటబడతారు.

ఈ కార్యక్రమమంతా ముగిసిన తర్వాత ఒకర్నొకరు ఇష్టపూర్తిగా పలకరించుకొని గుంపులు గుంపులుగా పాటలు పాడకుంటూ బజారులన్నీ కలబోసుకుంటూ ఇంటి మొఖం పడుతారు.

జొన్నల్ల పుట్టిన గౌరి - జొన్నల్ల పెరిగిన గౌరి
అన్నలేసిన పొన్నల కింద - నేను వేసిన నిమ్మలకింద
సల్లంగుండు సంపతి గౌరమ్మా

అని స్త్రీలు పాడుతుంటే ఊరు ఊరంతా ప్రతిధ్వనిస్తుంది.

మరుసటి రోజు దసరా. దేశమంతటి పండగే అయినా ప్రాంత ప్రత్యేకత ఉట్టిపడుతుంది. తెలంగాణ జాతీయ పక్షి 'పాలపిట్ట'కు, జెండా 'జొన్నకర్ర'కు, 'బంగారం'గా 'జమ్మి'ఆకుకు పూజచేసి ఆప్యాయంగా ఆనందంగా కులాతీతంగా ఆలింగనం చేసుకొని మురుస్తారు.

బతుకమ్మ పాట పాడుకోవటానికి, ఆశువుగా అల్లుకోవటానికి సులువుగా ఉంటుంది. ఈ పాటల్లో అనేక ఇతివృత్తాలు ఇమిడి ఉన్నాయి. బతుకమ్మ పుట్టుక గాధల నుంచి స్త్రీల జీవితంచుట్టూ అల్లుకుని ఉన్న కష్టాలనుంచి, అత్తింటి ఆరళ్లనుంచి, అన్నాచెల్లెండ్ల అనురాగాల నుంచి ఎన్నోకథనాలు సుదీర్ఘంగా సాగుతాయి. జనగామ రైలు ప్రమాదం, చెరువుకట్ట తెగిన వరదప్రమాదం, కరువుకాటకాలు, కాలవైపరీత్యాలు, ఆఖరుకు తెలంగాణ వీరుల అమరగాథలు, జానపదగాథలు, ఉద్యమాలు ఈ పాటలనిండా మార్మోగుతుంటాయి.

మానవ సంబంధాలు నిలబెట్టి, కొత్త జీవన స్ఫూర్తినినింపే బతుకమ్మ పండుగ తెలంగాణ ప్రజలకు గొప్ప ఊరట అయితే - ఈ యేడు బతుకమ్మలు వేసుకోవటానికి కూడా చెరువుల్లో నీళ్లులేక పండుగ కుంచించుకు పోవటం అంతకు మించిన విషాదం.

*- ఆంధ్రజ్యోతి, విజయదశమి సంచిక 2002*



తెలంగాణ ఉద్యమం చాలా ఊళ్ళు తింపి చూపింది. చాలా మందిని సోపతి చేసింది. అనేక కొత్త ఆలోచనలు రేకెత్తించింది.

తెలంగాణ రాష్ట్ర ఉద్యమం రాజకీయ నిరుద్యోగం లోంచి ఆవిర్భవించిందని అనిపించటానికి ఆంధ్రా మేధావులు పడుతున్న అవస్థ ఇంతా అంతా కాదు. నిజానికి - ప్రత్యేక రాష్ట్రం ప్రజల ఆకాంక్ష. తెలంగాణ రాష్ట్రోద్యమానికి రాజకీయార్థిక కోణంతో పాటు సాంస్కృతిక కోణం ఉంది. వనరులు, ఉద్యోగాలు, రక్షణలు చర్చకు వచ్చినంతగా భాషసంస్కృతులు చర్చకు రాలేదు. ప్రధానంగా సాంస్కృతిక విషయాలు చర్చకు తేవటం ఈ వ్యాసాల ఉద్దేశ్యం. ఉమ్మడిరాష్ట్రంలో సాంస్కృతికంగా తెలంగాణ అనుభవించిన వివక్షను ఎదిరించటం, తెలంగాణ ప్రత్యేక అస్తిత్వాన్ని నిర్ధారించటం, తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షల వెనుక సాంస్కృతిక నేపథ్యాన్ని వివరించటం మూడు అంశాల ప్రాతిపదికగా చర్చ సాగింది.

ఇందులోని వ్యాసాలు ఒక ప్రణాళిక ప్రకారం రాసినవి కాదు. పదేండ్లుగా ఆయా అవుసరాల మేరకు ఒత్తిళ్ల మేరకు రాయటం జరిగింది. తెలంగాణ వాదాన్ని, సందర్భాన్ని బలంగా నిరూపించే ప్రయత్నమే ప్రధానంగా భావించాను. అందువల్ల అక్కడక్కడ కొన్ని విషయాలు, ఉదాహరణలు, ఉటంకింపులు దృష్టిలో ఉంచుకోవలసిందిగా విజ్ఞప్తి.

ప్రత్యేక తెలంగాణ సాహిత్యం చాలా వచ్చినప్పటికీ భాషా సంస్కృతులకు సంబంధించి పుస్తకాల్లేవు. ఈ లోటును గమనించి తెలంగాణ ఉద్యమం మీది అభిమానంతో ఈ వ్యాసాలు పుస్తకంగా ప్రచురిస్తున్న సహచర శంకర్‌కు కృతజ్ఞతలు. శంకర్‌కు ఈ సూచన చేసిన ఆత్మీయుడు ప్రొ. కోదండరామ్‌కు కృతజ్ఞతలు. పుస్తకం రావాలని ఒత్తిడి చేసిన దేశపతి శ్రీనివాస్‌కు, పుస్తకం తీర్చి దిద్దటానికి సహకరించిన పర్‌స్పెక్టివ్స్ ఆర్.కె.కు, కథ నవీన్‌కు, ఫాంట్‌లైన్ నిర్మలకు..... కృతజ్ఞతలు

వ్యాసాలు రాయించిన, ప్రచురించిన పత్రికా సంపాదకులకు, వ్యాసాలు చదివి నిరంతరం ఉత్సాహపరిచే తెలంగాణ అభిమానులకు నిండైన....... **కృతజ్ఞతలు.**

**నందిని సిధారెడ్డి**
30.03.2007